# "నా చిన్నప్పుడు...."

రచన:

మోహన్‌దాస్ కరంచంద్ గాంధి

గుజరాతీభాషనుంచి

ఆంగ్లానువాదము—స్పష్టీకరణము

మహాదేవ్ దేశాయ్

ఆంధ్రీకరణము:

బుద్దెపూడి రాధాకృష్ణమూర్తి, బి. ఏ., బి. ఎల్.,


లిబరల్ బుక్స్ లిమిటెడ్

మద్రాసు - 2

వెల రూపాయి.

సంస్కృతి ప్రచురణ—40
వెల రూపాయి.

ప్రథమ ముద్రణ,
16-2-'52.

ప్రకాశకులు:
కల్చరల్ బుక్స్ లిమిటెడ్,
31, మీరాన్ సాహెబ్ వీధి,
మౌంట్ రోడ్డు :: మద్రాసు-2.

ముద్రాపకులు:
స్వతంత్ర ప్రెస్,
31, మీరాన్ సాహెబ్ వీధి,
మౌంట్ రోడ్డు :: మద్రాసు-2.

# 1

మానాన్న కాబాగాంధికి డబ్బును కూడఁబెట్టవలె ననుకోరిక యెన్నఁడునులేదు. ఆయన మాకిచ్చిపోయిన ఆస్తి యించుమించుగ నాస్తి.

అనుభవమె ఆయనవిద్య. మహత్తరమగు కార్యానుభవమువలన ఆయన క్లిష్ట సమస్యలనైన సరిదిద్ది పదిమందికి నచ్చఁజెప్పఁగల్గెడివాఁడు. తఱచుగ దేవాలయముల కరుగుటయందు, మతోపన్యాసములను వినుటయందు ఆయనకు మక్కువయెక్కువ. కడపటిరోజులలో ఆయన గీతాపారాయణ మొనర్పసాగెను. నిత్యము ప్రార్థనకాలమున గీతాశ్లోకములు చదివెడివాఁడు.

మా నాన్న స్వకులాభిమాని. సత్యవ్రతుఁడు, ధైర్యశాలి. ఉదార హృదయుఁడును. కాని, కొంచెము కోపిష్టి. స్వామిభక్తికి ఆయన 'పెట్టినపేరు.' కొంతకాల మాయన రాజకోట సంస్థానమునకు ప్రధానామాత్యుఁడుగ నుండెను. ఒకమాఱు సంస్థానాధీశునిగూర్చి చులకనగ పల్కిన ఆంగ్లప్రతినిధిని మందలించి మాన్యతనిల్పెను.

మా అమ్మ పవిత్రచరిత్ర. భక్తురాలు. నిత్యము ప్రార్థనాదికములను జరుపక భుజింపని నియమవంతురాలు. ఎంతటి కఠినవ్రతమునైనను పూనెనా, మానక కొనసాగింపఁగల మాన్యురాలు. వ్రతదీక్షకై ఉపవాసములుండుట ఆమెకు 'నల్లేరుపై బండినడక'. ఆమె నియమబద్ధముగ చాతుర్మాస దీక్ష నెఱపెడిది.

చాంద్రాయణ వ్రతమును జరుపుచున్న కాలమున ఆమె కొకసారి జబ్బుచేసెను. ఐనను, వ్రతదీక్ష వీసమైన సడలక జరుగవలసినదే! అటులనే జరిగినది. దుర్గ్మత మాయమైనది. స్థిరచిత్తము వ్రతదీక్షకు '(శ్రీ)రామరక్ష' యైనది.

ఒక్కొకమాఱు చాతుర్మాస కాలమున మా అమ్మకు ఒంటిపూఁట భోజనము నియమము. ఇంకొకసారి సూర్యుని దర్శింపకయె భుజింపకుండుట నియమము. జోరుగ వానలుకురియు కాలమున సూర్యునిదర్శనము లభించుట కొంత కష్టమెకదా? పిల్లలము కనిపెట్టుకొనియుండి సూర్యుఁడు కన్పించిన వెంటనె పరుగెత్తి మా అమ్మకు చెప్పెడివారము. ఆత్రముతో ఆమె వచ్చెడిది. అప్పటికె అతఁడదృశ్యుఁడయ్యెడి వాఁడు! 'పోనిమ్ము, నాయనా! ఈరోజునేను భోజనము చేయకుండుటయె భగవదేచ్ఛ కాఁబోలు,' అనుచు ఆమె లోని కేగెడిది!

మా అమ్మ వివేకవతి. సంస్థాన విషయములనుగూడ ఆమె తెలిసికొనెడిది. ఠాకూరుసాహెబుగారి కుటుంబస్త్రీలును ఆమెప్రతిభను మెచ్చుకొనెడివారు. ఆమె ఠాకూరుసాహెబు తల్లిని తఱుచుగ కలిసి సంభాషించెడిది. చిన్నతనముగుటచే నేనును ఆమెవెంట దివాణమునకు పోవుచుండెడివాఁడను. వారి చక్కని సంభాషణలు నాకు కొంచెము జ్ఞాపకమున్నవి.

నా జననము కథియవాడులోని, పోర్బందరునందు; 1869వ సంవత్సరము అక్టోబరు 2వ తేదీన. పోర్బందరునకు సుధామపురి అనియుపేరు. నాబాల్యము అక్కడనె గడచినది.

నన్నుబడిలోఁ జేర్చిన విషయము నాకుజ్ఞాపకమున్నది.

కొంతకష్టపడినఁగాని నాకు ఎక్కమ్ములైన రాలేదు. తక్కిన పిల్లలతోఁగలిసి ఉపాధ్యాయుని ఆడిపోసికొనుట నేర్చుకొనిన సంగతితప్ప నాకప్పటి యితర విశేషములు బాగుగజ్ఞాపకము లేవు. దీనినిబట్టి ఆనాఁడు నేనెంతటి మందబుద్ధినో ఊహింపవచ్చును.

## 2

మా నాన్నకు ఆస్థానమునందు ఉద్యోగము లభించుటతో మేము పోర్బందరునుండి రాజకోటకు మారితిమి. నాకప్పటికి ఏడేండ్లు.

నన్నొక ప్రాథమిక పాఠశాలలోఁ జేర్చిరి. చదువు మామూలే. ఏమైనను, తిన్నగ ఉన్నత పాఠశాలను ప్రవేశించితిని. అప్పటికె నాకు పండ్రెండవయేఁడు వచ్చినది.

నాకు బిడియము హెచ్చు. తోడిబాలురతో కలిసిమెలసి యుండు టెఱుఁగను. పుస్తకములే నా సహచరులు. వేళకు బడికి వెళ్లుట, బడి ముగియగనె సూటిగ తిరిగి యింటికి వచ్చుట నా దినచర్య. బాలురతో కలిసి మాటాడినచో ఎగతాళిచేయుదురేమో యని నా భయము. ఎవ్వరితోడను అబద్ధమాడి యెఱుఁగను. నేను ఉన్నత పాఠశాలలోఁ జేరిన మొదటిరోజులలో జరిగిన సంఘటన మొకటి చెప్పఁదగి యున్నది.

పాఠశాల కానాఁడు పరీక్ష. పరీక్షాధికారి వచ్చి ఉక్తలేఖన మిచ్చెను. నేనొక మాట తప్పు వ్రాయుట మా ఉపా

ధ్యాయుఁడు గమనించెను. ప్రక్కవాని పలకజూచి సరిదిద్దు కొనుమని అతఁడు సైగచేసెను. ఆ పని నాకు నచ్చలేదు. ఫలితము? నేనుతప్ప తక్కిన బాలురందఱు అన్ని మాటలను సరిగ వ్రాసిరి.

మా ఉపాధ్యాయుఁడు ఆనాఁటి నా వర్తనము అవివేకమూలక మని తెల్పుట కొకమాఱు ప్రయత్నించెను. కాని, లాభము లేకపోయెను. నేటికిని నేను అన్యులను గ్రుడ్డిగా ననుసరించలేను.



1877 రాజకోట ప్రాథమిక పాఠశాలలో

ఇట్లని, ఆ సంఘటనము ఆయన పట్ల నాకున్న గౌరవమును కుంచింపలేదు. సామాన్యముగ పెద్దవారి తప్పులు నేను గమనింపను. అది నాకు నైజము. తరువాతగూడ ఆయన లోపములు కొన్ని నాకు తెలియవచ్చెను. ఐనను, ఆయన మీఁద నాకున్న గౌరవము సడలలేదు. నేను నేర్చినది పెద్దవారి పనులను విమర్శించుట కాదు; వారి ఆజ్ఞల ననుసరించుట.

ఆ రోజులలోని మఱిరెండు సంఘటనము లిప్పటికిని నాకు మఱపురాకున్నవి. సాధారణముగ బడిపాఠములు దప్ప ఇతర పుస్తకముల జదువుట నా కలవాటులేదు. పాఠములు

చదువక శిక్షబొందుటన్నను, ఉపాధ్యాయులను మోసగించు టన్నను నాకు నచ్చదు. కావున, ప్రతిదినము పాఠములను మాత్రము తప్పక చదివెడివాఁడను. సాధారణముగ నితర పుస్తకముల నంటియెఱుఁగను.

ఎట్లో యొకతూరి మా యింటనున్న 'శ్రావణుని పితృభక్తి' అను నాటకము నా కంటఁబడినది. మిక్కిలి శ్రద్ధతో దానిని చదివితిని. గ్రుడ్డివారగు తన తలిదండ్రులను తీర్థయాత్రకై శ్రావణుఁడు మోయుచున్నట్లు ఆ రోజులలోనె బొమ్మలు చూచితిని. ఆ కథ — ఆ దృశ్యము — నా మనస్సులో హత్తుకొనిపోయెను. 'అది నీకు ఒరవడిసుమా' — అని నా అంతరాత్మ బోధించినట్లయ్యెను.

ఒక పర్యాయము హరిశ్చంద్రనాటకము జూచితిని. ఎన్నిమార్లు చూచినను తనివితీర దనిపించినది; హరిశ్చంద్రుని కథ నా మనసున కెక్కినది. హరిశ్చంద్రునివలె నందఱు సత్యసంధులేల కారాదని నాలో నేనె చాలసార్లు ప్రశ్నించుకొంటిని. హరిశ్చంద్రునివలె కష్టములెన్ని కల్గినను సత్యము దప్పకుండుటయె ఉత్తమాదర్శమని నాలో ప్రబోధము కల్గినది. హరిశ్చంద్రుఁడు చారిత్రక పురుషుఁడై యుండఁడని నా యింగితజ్ఞానమునుబట్టి యిపు డనుకొందును. కాని, నిజమునకు హరిశ్చంద్రుఁడు, శ్రావణుఁడు నాకు నిత్యసజీవమూర్తులు.

చదువులో నేను చవటనుగాను. ఉపాధ్యాయుల కెల్లపుడును ప్రేమపాత్రుఁడనే. చదువులో, శీలములో మంచి యోగ్యతాపత్రిములను పొందుచుండెడివాఁడను. కొన్ని బహుమతులను, విద్యార్థివేతనములనుగూడ బడసితిని. వానికి

నా యోగ్యతకంటె నా అదృష్టము ఎక్కువ కారణమను కొందును.

శీలమును కాపాడుకొనుటలో నాకు శ్రద్ధ మిక్కుటము. ఏమాత్రము లోపము కల్గినను మిక్కిలిగ చింతించెడివాఁడను. ఒకసారి బెత్తముతో దెబ్బలుతింటిని. దెబ్బలకు కాదుగాని, దెబ్బలు తినవలసివచ్చెనుకదా యని మిక్కిలి దుఃఖించితిని.

తప్పనిసరి చేయఁబడినదాఁక బడి ఆటలలో—వ్యాయామములో పాల్గొనెడివాఁడనుకాను. ఎక్కువ బిడియమున్న వాఁడనగుటయె యిందుకు కారణము. అంతియెకాదు. ఆ రోజులలో నాకు విద్యాభ్యాసమునకు శరీర వ్యాయామమునకు నెట్టి సంబంధములేదను దురభిప్రాయము నుండెడిది. మానసిక శిక్షణమున కెంతటి ప్రాముఖ్యత కలదో శరీర పరిశ్రమకు నంతటి ప్రాముఖ్యత అవసరమని యిపుడు గ్రహించితిని.




నేను మంచి దస్తూరిని అలవాటు చేసికొనుటలో గూడ నిర్లక్ష్యము జేసితిని. దానికపరాధమిపుడు చెల్లించుచున్నాను. ఏలనో నాకు విద్యాభ్యాసమున మంచి దస్తూరి అవసరముకాదను అభిప్రాయముండెడిది. 1883 రాజకోట హైస్కూలులో ఇంగ్లాండున కేగినపుడుగాని ఈ అభిప్రాయము తప్పుఅని

గ్రహింపలేకపోతిని. అందములేని దస్తూరి వ్రాయుట విద్యా విధానమున గొప్ప లోపమే. విద్యాభ్యాసమున చక్కని దస్తూరిని అలవాటు చేసికొనుటగూడ ముఖ్యమని ప్రతి యువకుఁడును, యువతియు గ్రహింపఁదగును.

నా చిన్ననాఁటి చదువు విషయములింక నొకటిరెండు చెప్పఁదగినవి కలవు. నాల్గవ తరగతినుండియె దాదాపుగ విషయములన్నియు ఆంగ్లమున బోధింపఁబడుచుండెడివి. నా స్థితి అయోమయమైనది. అసలు క్షేత్రగణితములో నాకు చొరవ తక్కువ. అది ఆంగ్లమున బోధింపఁబడుట 'గోరు చుట్టుపై రోఁకటిపోటు' వలె నైనది. ఎట్లో శ్రమజేసి మెల్లగ దానిలో కొన్ని సిద్ధాంతములు జీర్ణముజేసికొంటిని. ఇఁక నేమి? క్షేత్రగణితము నాకు 'అఱచేతిలోని అరఁటిపండై'నది. హేతువాదముతో గ్రహింపఁగల్గిన విషయ మేదియైనను కష్టము కాదుకదా!

సంస్కృతము మాత్రము మ్రింగుడువడలేదు. క్షేత్రగణితములో కంఠస్థము చేయనలసినదిలేదు. సంస్కృతములో నంతయు వల్లింపవలసినటులె తోఁచినది. నాల్గవతరగతియందె సంస్కృతము ప్రారంభమైనది. ఆఱవతరగతికి వచ్చునప్పటికి నాపని "లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె" అనినట్లయినది. అంతటితో నాఁగలేదు. మా సంస్కృతోపాధ్యాయుఁడు మమ్ము అప్పటికప్పుడె సానలఁబట్టి మెఱుఁగు బెట్టవలెనన్న ఆత్రములోనుండెను. పారశీకభాషను బోధించు ఉపాధ్యాయునకు, సంస్కృతోపాధ్యాయునకు పోటీపడినది. పారశీకోపాధ్యాయుఁడు కొంత చనవుజూపెడివాఁడు. అందు

వలన పిల్లలలో పారశీకమును నేర్చుకొనుట సులభమను అభి ప్రాయ మేర్పడినది. నేను సంస్కృతపు తరగతి వదలి ఒక రోజు పారశీకపు తరగతిలోఁ జేరితిని. మా సంస్కృతోపా ధ్యాయున కది కష్టమనిపించినది. ఆయన నన్ను పిలచి, "వైష్ణవుల ఇంటఁబుట్టినవాఁడవు, మీ మతభాష నేర్చు కొనవా, యేమి? సంస్కృత మిపుడు కొంత కష్టముగనున్నను, ముందుముందు సులభముగ, హృద్యముగ నుండును. అధై ర్యము విడిచి, మరల సంస్కృతపు తరగతిలోనికి రా!" అని చెప్పెను.

మా సంస్కృతోపాధ్యాయుఁడు—కృష్ణశంకర పాండ్య ఇచ్చిన సలహా అమూల్యమైనది. ఆయన చూపిన దయ అంతులేనిది. ఆయనకు కృతజ్ఞుఁడను. ఈమాత్రమైన నేనా నాఁడు సంస్కృతము నేర్చియుండనిచో మన పవిత్ర గ్రంథము లను చదువ నోఁచుకొనియుండనివాఁడనే. నిజమునకు, ఇంకను హెచ్చుగ సంస్కృతభాషా పరిజ్ఞానమును పొందకుంటినే యని పరితపించుచుందును. హైందవ బాలబాలికలందఱు చక్కని సంస్కృత పరిజ్ఞానమును సంపాదించుట అవసరమని యిపుడు గ్రహించితిని.

మన ఉన్నత పాఠశాలలలో విషయములు మాతృ భాషలో బోధింపఁబడవలెనని, హిందీ–సంస్కృత–పారశీక –అరబ్బీ–ఆంగ్లభాషలకును తగిన స్థానముండవలెనని నా యభిప్రాయము. ఇదేమి, ఇన్నిభాషలా? అని భయపడనక్కఱ లేదు. మన విద్యావిధానము క్రమపద్ధతిలో నడచినచో, విద్యార్థులకు పరభాషలో విషయములు నేర్చుకొనవలసినబాధ

తొలఁగినచో, ఇన్ని భాషలను నేర్చుకొనుట కష్టమనిపించదని, ఉల్లాసకరముగ నుండునని నిశ్చయముగ చెప్పఁగలను. ఒక భాషలో శాస్త్రయుక్తమైన పరిజ్ఞాన మేర్పడినచో, ఇతర భాషలను నేర్చుట కొంతసులభము కాకపోదు.

నిజమునకు హిందీ – గుజరాతి – సంస్కృతభాషలకుగల సన్నిహిత సంబంధమునుబట్టి వానిని మూఁడింటిని ఒకభాషగనె పరిగణింపవచ్చును. అట్లె, పారశీక – అరబ్బీ భాషలనొక భాషయె అనవచ్చును. పారశీకభాష ఆర్యభాషాకుటుంబమునకును, అరబ్బీభాష 'సెమిటిక్' భాషాకుటుంబమునకునుఁ జెందియున్నను, ఇస్లామ్ మతాభివృద్ధినిబట్టి ఆ రెండుభాషలు పూర్తివికాసము నొందినవి. నా దృష్టిలో ఉర్దూ ప్రత్యేక భాషకాదు. అది హిందీ వ్యాకరణమునే అనుసరించినది. ఉర్దూ భాషలోని పదజాలము హెచ్చుగ పారశీక – అరబ్బీ భాషలలోనిదే. కావుననే, గుజరాతి – హిందీ – వంగ – మహారాష్ట్రభాషలు చక్కఁగనేర్చుకొనఁగోరువారు సంస్కృతమును తప్పక చదువవలసియున్నట్లె, ఉర్దూభాషను చక్కఁగనేర్చుకొన నెంచినవారు పారశీక – అరబ్బీభాషలను తప్పక చదువవలసియుండును.

# 3

నాకు చిన్నతనములో– పదుమూఁడవయేఁటనే – పెండ్లియైనది. ఇపుడు నా రక్షణలోనున్న అవయసు వారిని చూచుచు, అప్పటి నాపెండ్లివిషయమును తలఁచుకొన్నచో

నా స్థితియె వారికిని కలుగనందుకు వా రభివందనీయులే. పెండ్లి నాఁటికి నేను ఉన్నతపాఠశాలలో చదువుచున్నాను. ఇట్లు విద్యార్థిదశయందె వివాహమగు పరిస్థితియున్నది ఈ నాటి మన హైందవ సంఘముననే.

దుఃఖకరమైన మరియొక విషయము చెప్పవలసి యున్నది. అదినాకు చెడు సహవాసమేర్పడిన ఘట్టము. నా జీవితములో అదియొక విషాదగాథ. నాకు పరిచయమేర్పడిన యొకమిత్రుఁడు తొలుత మా అన్నయ్యకు సహాధ్యాయి. అతనితో స్నేహముజేయవలదని మాఅమ్మ, జ్యేష్ఠసోదరుఁడు, నాభార్య హెచ్చరికజేసిరి. భర్తనను అహంభావముతో నాభార్యమాటను వినలేదు. కాని, మా అమ్మమాటకుగాని, జ్యేష్ఠసోదరుని మాటకుగాని త్రోసిరాజు చెప్పఁగల ధైర్యము లేదు. నా మిత్రుని గుణములతోఁబాటు, అతని లోపములును నే నెఱుఁగుదునని, అతనిని సంస్కరించుటయె నా యుద్దేశ్య మని వారితోఁ జెప్పి తప్పించుకొంటిని.

నిజమునకు నేను పొరపడితినని క్రమముగ తెలిసి కొంటిని. ఒకనిని సంస్కరింపనెంచినచో అతనితో మిక్కిలి సన్నిహిత సంబంధము పొసగుటకష్టము. ఆత్మలు ఐక్యత జూపుట నిక్కమైన స్నేహమునకు తార్కాణము. ఓకేవిధ మగు ప్రవృత్తియున్నవారిలోగాని స్నేహము యోగ్యముగ, శాశ్వతముగ నిలువఁజాలదు. స్నేహితుల స్వభావములకు పరస్పర సంబంధ ప్రభావములుండును. కావుననే, స్నేహములో సామాన్యముగ సంస్కరణమునకు తావుండదు. సహజముగ మానవునకు సుగుణములకంటె దుర్గుణములు త్వరితముగ

పట్టువడును. భగవంతునితో స్నేహము నభిలషించువాఁడు ఒంటరియైనఁ గావలెను; లేదా, ప్రపంచమునంతటి తోడను స్నేహము నెఱపవలెను. నా యోచన తప్పు కావచ్చును. ఏమైనను మిక్కిలి సన్నిహిత సంబంధము నెఱపవలెనని న నా యత్నము ఫలింపలేదు.

నా మిత్రునితో సాంగత్యముకల్గిన రోజులలో రాజకోటలో సంస్కరణాభిలాష ఉప్పెనవలె పొంగుచున్నది. చాలమంది ఉపాధ్యాయులు, ఇతర పెద్దలు, విద్యార్థులు రహస్యముగ మాంసభక్షణము, మద్యపానముఁ జేయుచుండిరని నా స్నేహితుఁడు చెప్పెను. అతఁడు మాంసభక్షణము శరీరమునకు బలమునిచ్చునన్నెను. మాంసాహారు లగుటనలననే ఇంగ్లీషు వారు మనపై అధికారమువహింపఁగల్గి రనెను. మాంసభక్షకులెక్కువ ఆరోగ్యవంతులుగ నుందురనెను. తుదకు, మాంసము దినుమని అతఁడు నన్ను ప్రోత్సహించెను.

మా అన్నయ్య అప్పటికె మాంసభక్షణలో దిగెను. అందుచే అతఁడు నా మిత్రునివాదనకు బలమిచ్చెను. వారితో పోల్చుకొనినచో నేను చాల దుర్బలశరీరుఁడనే. వారుదృఢశరీరులు, సాహసవంతులు. నా మిత్రుఁడు తనసాహస కార్యములతో నన్ను చకితునిజేసెడివాఁడు. అతనివలె దృఢకాయుఁడను కావలెనను వాంఛ నాలో నాటుకొన్నది.

ఇదియెకాదు. అసలు నేను పిఱికిపందను. దొంగలు, దయ్యములు, పాములు అనిన నాకు భయము. రాత్రులందు గడపదిగి కదలుటకు నాకు ధైర్యములేదు. చీఁకటి నా పాలిట పెనుభూతమె. చీఁకటిలో నిద్రించుటకును జంకెడివాఁడను.

నా పిఱికితనమును నా భార్యకుమాత్రము తెలియనీయలేదు. ఏమని చెప్పుకొనఁగలను ? నాకంటె ఆమెకు ధైర్యము హెచ్చు అని నే నెఱుఁగుదును. నా స్థితికి నేనె సిగ్గిలితిని.

నా పిఱికికండ నెఱిఁగిన నా మిత్రుఁడు తన సాహసమును గూర్చి యినుమిక్కిలిగ చెప్పసాగెను. తాను పాములనుబట్టి చిదుమఁగల ననెను. దొంగల నెదుర్కొని మార్కొనఁగలన నెను. దయ్యములనిన తనకు భయమే లేదనెను. అంతటి శక్తికి తన మాంసాహారమె కారణమనెను.

మాంసభక్షకు లగుటవలననే బలిష్ఠులై ఆంగ్లేయులు భారతీయులను పాలింపగల్గుచున్నారను భావముతో నర్మద్ అను గుజరాత కవి వ్రాసిన చిన్ని గేయమొకటి మా విద్యార్థులలోఁ బ్రచారము పొందినది. ఇఁక నేమున్నది ? ఇన్నియుఁ గలిసి నన్ను వంచినవి. మాంసాహారమువలన బలము, సాహసము కల్గుననుకొంటిని. భారతీయులందఱు మాంసాహారులైనచో ఇంగ్లీషువారిని జయింపఁజాలుదురుకదా అనుకొంటిని.

నా 'సంస్కరణ'కు 'ప్రారంభోత్సవము' నిర్ణయమైనది. కాని, అంతయు రహస్యముగ జరుగవలెను. వైష్ణవమతనిష్ణాతులైన నా తలిదండ్రులకీ విషయము తెలియరాదు. తెలిసినచో వారు తబ్బిబ్బుజెంది కుమలకమానరు. ఈ పనివలన నా తలిదండ్రులను మోసగించుచుంటినను తలఁపు నాకానాఁడు కలుగలేదని చెప్పఁజాలను. కాని, నా 'సంస్కరణ'ను సాధింపవలెననియే కోరితిని. నేను జిహ్వాచాపల్యమువలన మాంసభక్షణమునకు పూనుకొనలేదు; నాకు బలము, సాహసము

సమకూడవలెనని యే నా కోరిక. దేశీయులందఱు నిట్టి సాధనకై పూనుకొని, ఇంగ్లీషువారిని జయించి, మాతృదేశమునకు స్వాతంత్ర్యము సంపాదింపవలెననుకొంటిని. 'స్వరాజ్యము' అను మాటను ఆనాఁటికి నేను వినకున్నను, స్వాతంత్ర్యమన నేమియో యెఱుఁగుదును. 'సంస్కరణము' జరుగవలెనన్న ఆవేశము నన్ను ముంచియెత్తినది. తలిదండ్రులకు తెలియకుండ ఈ పనిని సాధించినమాత్రమున సత్యమునకు భంగము కలుగదు లేయని, తప్పుదారిలో, నాకు నేనే సమాధానము జెప్పుకొంటిని.

అనుకొనినరోజు వచ్చినది. అప్పటి నా స్థితి వర్ణింప నలవికానిదైనది. ఒకవంక సంస్కరణాభిలాష పొంగిపొర్లు చున్నది; ఇంకొకవైపు దొంగవలె చాటుమాటుపనులు చేయవలసివచ్చెనను అవమానము పీడించుచున్నది. ఏమైననేమి? నా జీవితములో మొదటిసారిగ ఆనాఁడే మాంసమును చూచి తిని. మాంసముతోఁబాటు రొట్టెయు నున్నది. వీనిలో నేదియు రుచించలేదు. అది మేఁకమాంసము — బిగిసిన తోలు వలె నున్నది. తినలేక పారవేసితిని.

ఆ రాత్రి నా స్థితి సంకటమైనది. సరిగ నిద్రపట్టలేదు. కునుకు వచ్చెనా, నా కడుపులో బ్రదికియున్న మేఁక అఱచు చున్నట్లు ఆలాపనకల్గి, త్రుళ్ళిపడి లేచెడివాఁడను. అంతలో మాంసము దినుట నా విధియని జ్ఞాపకముదెచ్చుకొని ధైర్యమూనవలె ననుకొనెడివాఁడను!

# 4

నా స్నేహితుఁడు సులభముగ విడచెడివాఁడు కాడు. అతఁడు మాంసముచేరిన వంటకములు చాల రకములు తయారు చేయింపసాగెను. ఈ 'విందులు' మంచిభవనములో, నాజూకు పరికరములతో సాగునట్లుచేసెను. క్రమముగ నే నావంటకములఁ దినుట కలవాటు పడితిని. నాకు మాంస మనిన పూర్వపురోఁత పోయినది. మేఁకలపై దయ మాయ మైనది. ఈ విధముగ దాదాపు ఒక సంవత్సరము గడచినది. కాని, తగినంతడబ్బు లేకపోవుటచే ఈ 'విందులు' ఎక్కువగ జరుగుట కవకాశము లేకపోయినది.

ఇట్లు విందుపొందులందినరోజు యింటికడ భోజనము చేయలేక పోయెడివాఁడను. అట్టివేళల, 'భోజనమేలచేయవు, నాయనా?' అని మాఅమ్మ ప్రశ్నించెడిది. 'ఆఁకలిలేద'ని చెప్పి తప్పించుకొనెడివాఁడను. నేను మాంసాహారి నైతినని తెలిసికొన్నచో నాతలిదండ్రు లెంతటి పరితాపమునొందుదురో నేనూహింపక పోలేదు. ఆ తలఁపు నన్ను అనుక్షణము బాధించుచునేయున్నది.

ఇట్టిస్థితిలో నాలో నేనొక నిశ్చయమునకు వచ్చితిని. "మాంసభక్షణమను ఈ 'ఆహారసంస్కరణ' అవసరమె; కాని, తలిదండ్రులను మోసగించుట మాంసముఁదినుటకంటె హీనమైనది. కావున, వారు జీవించియున్నంత కాలము నేను మాంసముముట్టను; తదనంతరము నా కోరికల దీర్చుకొనుటకు స్వేచ్ఛయుండును; అపుడు బహిరంగముగ మాంసముఁదినుట

కభ్యంతర ముండదు’’—ఇట్లనుకొని, నాఁటితో మాంసాహార మును మానివేసితిని. నాఁటిమాటయె నేఁటికిని.

తలిదండ్రులను మోసగించుట ధర్మముకాదని మాంస భక్షణము మానితిని. కాని, నా మిత్రునితో సాంగత్యము మానలేకపోతిని. అతనిని సంస్కరింప వలెననుకొనిన నా యత్నము వమ్మైనది.

ఈ దుస్సాంగత్యము ఫలితముగ నేను నాధర్మపత్నికే అపచార మొనర్పనైన స్థితికివచ్చితిని. ఎట్లో పాపకూపమునఁ బడకుండ దయామయుఁడగు పరమేశ్వరుఁడు నన్నురక్షించెను. దుస్సాంగత్యమున నేనెంత పతనము జెందితినో తరువాత చాల కాలమునకుఁగాని తెలిసికొనలేకపోతిని.

నామిత్రుని మూలమునఁగల్గిన యింకొక సంకటము చెప్పవలసియున్నది. నేను భార్యానురక్తుఁడను. అయ్యు, మిత్రునిమాటలునమ్మి నాభార్యను అనవసరముగ, అన్యాయ ముగ శంకించితిని. అటులామె మనసున కెన్నిమాఱులో కష్టము గల్గించిన నాతప్పును మఱువజాలను.

శంకాన్వితులగు భర్తలు పెట్టుబాధలకోర్చుట నేర్చి నది హైందవమహిళలు మాత్రమే. హైందవాంగన క్షమకు పరిత్రివంటిది. యజమాని అనుమానించినచో నౌకరు పని విడిచిపోవును. తండ్రి శంకించినచో తనయుఁడు ఇలువిడిచి పోవును. స్నేహితుఁ డనుమానించినచో మిత్రత్వము విడి పోవును. భార్య భర్తననుమానించినచో తనలోఁదాను సమిలిపోవును. భర్త భార్యను శంకించినచో ఆమె యేమగును? ఎక్కడికి పోగలదు? ఎట్లు మనగలదు? విడాకులు సాధారణ

ముగ హైందవాంగనకందని మార్గము. ఇఁక ఆమెకేమి మనుగడ ?

అన్యాయముగ లేనిపోని అనుమానములకులోనై నా భార్యను శంకించి, హింసించిన నాతప్పిదము క్షమార్హము కానిది. అహింసాధర్మమును బాగుగ మననము జేసికొనిన పిదపగాని నేను నాలోని అనుమానపిశాచమును పాఱఁద్రోల లేకపోతిని. అపుడె బ్రహ్మచర్య ప్రభావమును గుర్తించితిని. భార్య భర్తకు కేవలము దాసి కాదు; అతనికి సహచారిణి, సహకారిణి; అతని సుఖదుఃఖములలో సహభాగిని; అతనికి వలె స్వాతంత్ర్యముగల్గిన సహధర్మిణి — అనిగ్రహించితిని.

## 5

చిన్ననాఁటి నాలోపములు మఱికొన్ని చెప్పవలసి యున్నవి. నేను, మాచుట్టమొకఁడు పొగత్రాగుటను అలవాటు చేసుకొంటిమి. బీడీలవాసన మమ్మాకర్షించినది. పొగవిడచుచు చిన్నిమబ్బులను కల్పించుటలో సరదాపడితిమి. కాని, బీడీలు కొనుటకు డబ్బులేదు. కొన్నాళ్లు మామేనమామ కాల్చిపాఱవేసిన బీడీముక్కల నుపయోగించితిమి. వానితో తనివితీరక, బీడీలకై మా నౌకరు జేబునుండి పైసలు దొంగి లింప సాగితిమి. మఱికొన్నాళ్లు కొన్నిబోలుపుల్లలను సిగరెట్ల వలెకాల్చి, గుప్పుగుప్పున పొగవిడచెడివారము. ఏదిచేసినను రహస్యముగ చేయవలసియున్నది. బహిరంగముగ ఏమిచే యుటకును పెద్దవారి అనుమతి దొరకదు. ఇట్టి స్వేచ్ఛలేని

బ్రతుకుపై రోఁతగల్గినది. తుదకు ఆత్మహత్య చేసికొనుటకు నిశ్చయించుకొంటిమి.

ఉమ్మెత్తగింజలు విషతుల్యములని, వానిని తినిన వెంట నె ప్రాణముపోవునని వినియుంటిమి. తిరిగి తిరిగి దూరపుటడవికి పోయి వానిని తెచ్చుకొంటిమి. కేదారస్వామి ఆలయమునకు పోయి స్వామినిదర్శించితిమి. కడకొక రహస్యస్థలమును చేరితిమి. ఆత్మహత్యకు అంతయుసిద్ధమైనది. అంతలో ఆలోచన లనేకము కల్గినవి—ఇంత చేసినను ప్రాణముపోకున్న ఏమగును? స్వేచ్ఛలేకున్న నేమైనది? చనిపోయి సాధించునదేమి ?— అని. ఆలోచనలు తెగలేదు. ఎట్లో రెండు, మూఁడు గింజలు మ్రింగితిమి. ఇఁక ధైర్యముచాలలేదు. ప్రయత్నము విర మించితిమి. మనసునకు స్వాస్థ్యము జేకూర్చుకొనుటకు రామా లయమున కరిగితిమి.

ఆత్మహత్య అనుకొనినంత సులభసాధ్యము కాదని గ్రహించితిని. కావుననే, అప్పటినుండి యెవరైనను ఆత్మ హత్య చేసుకొందుమని బెదరించినను, నేనులక్ష్యముచేయను.

ఆత్మహత్యను విరమించుటతోఁబాటు బీడీలుత్రాగుట, వానికై పైసలు దొంగిలించుట గూడ విరమించితిమి. పొగ త్రాగవలెనను తలంపు యిఁకనెన్నఁడు కలుగలేదు. పొగ త్రాగుట అనారోగ్యకరము, అనాగరకము నగు అలవాటుగ పరిగణింపఁ జొచ్చితిని. పొగత్రాగు అలవాటు ప్రపంచమున నింత హెచ్చుగ వ్యాపించు టేలనో యూహింప లేకున్నాను. పొగత్రాగుచున్నవారున్న రైలుపెట్టెలో ప్రయాణ మొనర్చు టనినను నాకు దుర్భరమైనది.

చిన్నతనమున బీడీలుకాల్చుట, పైసలు దొంగలించుట కంటె నేనుచేసిన పెద్ద నేరమింకొకటి యున్నది.

మాంసాహారియైన మాఅన్నయ్య అప్పులపాలయ్యెను. అతని చేతి బంగారుమురుగులో ఒక ముక్క కత్తిరించితిని. దానితో ఆబాకీలు తీర్చితిని. ఏమైనను, ఈ దొంగతనము నాకు భరింపరానిదైనది. ఎన్నఁడును దొంగతనము చేయరాదని అపుడె నిశ్చయించుకొంటిని. చేసినతప్పును మానాన్నతో చెప్పివేయవలె ననుకొంటిని. కాని, చెప్పుటకు ధైర్యముచాలలేదు. మిన్నకుండుటకును మనస్కరించలేదు.




1886 హైస్కూలులో ఆఖరు సంవత్సరం —అన్నగారితో

నేనుచేసిన తప్పిదమును తెల్పుచు నాకుతగిన శిక్ష విధింపుమని కాగితముపై వ్రాసి మానాన్నకిచ్చితిని. నా చేతులు వణఁకినవి. తలవాల్చి నిలిచితిని.

మానాన్న కాగితమును చదివెను. ఆయనకనుల వెంట బొటబొట నీరుకారి కాగితముతడిసినది. ఆకన్నీటి బిందువులలో ఆయన పరితాపము ద్యోతమైనది. నాలో దుఃఖము పొంగి వెల్లువయైనది. అబ్బ! ఈనాఁటికిని ఆ దృశ్యము నాకు

కనులఁగట్టినట్లున్నది! ఆయన ప్రేమాశ్రుకణములు నాపాప పంకిలమును కడిగివేసినవి. అట్టి ప్రేమాతిశయమును అనుభ వించినవారికిగాని దానిశక్తి తెలియదు. ఈసంఘటనమువలన అహింసాధర్మమున ఒక గుణపాఠము నేర్చుకొనఁగల్గితిని. ఇట్లు ఉదాత్తమైన క్షమాభిక్షనిచ్చుటలో మానాన్న నెఱదాత. చేసినతప్పునకు నిండుమనస్సుతో పశ్చాత్తాపమువెందిన నా యెడ మానాన్నకు విశ్వాసము, అనురాగము నతిశ యించినవి.

నా పదునాఱవయేఁట మానాన్న పరమపదించెను.

# 6

మేము రాజకోటలో నున్న కాలమున హిందూమతము లోని వివిధశాఖలయందేకాక, ఇతర మతములయందును తొట్టతొలుతగ నాకు సహిష్ణుత యేర్పడినది. భేదములేక మా తలిదండ్రులు శైవ – వైష్ణవాలయములకు వెళ్ళుచుండెడివారు. పిల్లలకుమాకు నదియె మార్గమైనది. జైనులు మా నాన్నతో తఱచుగ మతవిషయాదులనుగూర్చి సంభాషించుటకు వచ్చు చుండెడివారు. వారు మా ఆతిథ్యమునుగూడ అంగీకరించు చుండెడివారు.

మానాన్నకు మహ్మదీయులు, పార్శీలుగూడ మిత్రు లుండిరి. వారితో మతచర్చలలో ఆయన మిక్కిలి యుత్సా హముతో పాల్గొనెడివాఁడు. ఆయనకు పరిచర్య నొనర్చు చుండెడివాఁడ నగుటచే నాకా విషయములను తఱచుగ విను

అవకాశము కల్గినది. ఇన్నివిధములుగ నాలో పరమత సహిష్ణత పొడుకొన్నది.

నాలో మతసహిష్ణత కల్గెననుటచే భగవంతునియెడ నాకు సంపూర్ణ విశ్వాసము కల్గెననుకొనరాదు. ఒక్క విషయముమాత్రము నాలో నిశ్చితమైనది. ఋజువర్తనము అన్నిఁటికి మూలమనియు, సత్యము ఋజువర్తన కాధారమనియు నాకు స్థిరపడినది. సత్యము నాకు పరమలక్ష్యమైనది. నాలో ఈ ప్రవృత్తి అనుదినమభివృద్ధి నొందసాగినది.

అపకారికైనను ఉపకార మొనర్పుమని ప్రబోధించు చిన్ని గుజరాతిగీతిక యొకటి నన్నాకర్షించినది; నా హృదయమున గాఢముగ హత్తుకొనిపోయినది. ఈ సూత్రము నాకు నిత్యతారకమై నిలిచినది.

## 7

1887 వ సంవత్సరమున మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుఁడనైతిని. పిదప భావనగరమున కళాశాలలోఁ జేరితిని. కాని, అచటి చదువునాకు అంతుపట్టలేదు. అచటిఉపన్యాసకులు గట్టివారే. నేనే అట చెలామణి కాఁజాలని ముడిసరకును! కొలది మాసములకె కళాశాలలో చదువుకట్టిపెట్టి యిలుజేరితిని.

మావ్ జీ దవె మాకుటుంబమునకు చిరకాలమిత్రుఁడు, సలహాదారు. ఆయన ఒకసారి మాయింటికివచ్చి నన్ను ఇంగ్లాండు దేశమునకుపంపి బారిస్టర్ పరీక్షకు చదివించుట లాభకరమని చెప్పెను. ఇచట కళాశాలలో చదువు సాగక

సంకటపడిన నాకు ఆయనసలహా అమృతమయినది. ఇంగ్లాండు నకు ప్రయాణమగుటకు ఉవ్విళ్లూరితిని.

దవే సలహాకు మా అన్నయ్య ఆలోచనలోఁ బడెను. నాకెంత డబ్బు ఖర్చగునో, అతఁడెచటినుండి తీసికొనిరాగలఁడు? పై పెచ్చు, నావంటి యువకునినమ్మి ఒంటరిగ పరదేశమున కంపుట భావ్యమా?

మా అన్నయ్యకంటె మాఅమ్మ యెక్కువఆందోళన జెందినది. నన్నువదలియుండుటె ఆమెకుకష్టము. అంతియె కాదు. నావంటియువకులు ఇంగ్లాండునకు వెళ్లినచో నచట విచ్చలవిడిగ విహరింతురని, మద్యమాంసాదులరుచి మరగక తప్పరని యెవ్వరో చెప్పుకొనుచుండ ఆమెవిన్నది. ఆ విషయ మున నన్ను ప్రశ్నించినది. నన్ను నమ్మి పంపుమని నేనర్థిం చితిని. ఆమె బేచర్జీస్వామి సలహాసహితము తీసికొనవలె నన్నది.

బేచర్జీ మాకుటుంబమునకు చిరపరిచితుఁడు, సలహా దారుఁడు. ఆయన జైనమతావలంబి. మాఅమ్మ తన సంశయమును ఆయనతోఁ జెప్పెను. నాచేత ప్రమాణము చేయించి పంపవచ్చునని ఆయన సలహాచెప్పెను. మాంసము, మద్యము, మహిళ — అను మకారత్రయమును ముట్టనని ఆయన నాచే ప్రమాణము జేయించెను. అంతటితో నా ప్రయాణమునకు మా అమ్మయు సమ్మతించెను.

ఆ రోజులలో రాజకోటనుండి నావంటి యువకుఁడు ఇంగ్లాండునకేగుట కొంచెము అసాధారణవిషయమే. ఉన్నత పాఠశాలలో నాకు పెద్దవీడ్కోలు సభజరిపిరి. కాగితముపై

వ్రాసికొనియుంచుకొన్న నాలుగుమాటల నెట్లో తడఁబడుచ చెప్పి వారికి నాకృతజ్ఞత వెల్లడించితిని.

# 8

1888 వ సంవత్సరము సెప్టెంబరులో బొంబాయి రేవు నుండి ఇంగ్లాండునకు బయలు దేఱితిని. నాకంతయు బిడియమే. నాకుఇంగ్లీషులో మాట్లాడుట అలవాటులేదు. మజుందార్జి తప్ప ఓడలోని నాతోడి ప్రయాణికులందఱు ఆంగ్లేయులవలెనె కన్పట్టిరి. వారితో మాట్లాడుటకె బిడియము గలవాఁడను, కలసిమెలసి యుండుటెట్లు? ఆంగ్లేయుల పద్ధతిలో ఆహారము దినుట అసలె యెఱుఁగను. వంటకములలో మాంసముండెనేమో అడిగి తెలిసికొనుటకు ధైర్యము చాలలేదు. నావెంట దెచ్చికొనిన పండ్లు, మిఠాయిలతో కాలముగడపితిని.

మజుందార్జీ అందఱతో బాగుగ కలుపుగోలుతనముఁ జూపెను. నా బిడియమును పోఁగొట్టుటకు ప్రయత్నించెను. న్యాయవాదవృత్తిలో ధారాళముగ మాట్లాడుట అవసరమనెను. తప్పులు దొర్లునని భయపడక వీలుకల్గినపుడెల్ల ఇంగ్లీషులో మాట్లాడుట అలవాటు చేసికొమ్మనెను. ఆయన ఎంతప్రోత్సహించినను నాది ఎప్పటినడకయే!

ఓడలోని ప్రయాణికులలో నొకఆంగ్లేయుఁడు నాయెడ స్నేహముఁ బ్రకటించి నన్ను సంభాషణములోనికి దింపెను. నేను మాంసమొల్లనని విని నవ్వెను. ఇంగ్లాండున కరిగినపిమ్మట నైన నాపద్ధతిని మార్చుకొనక తప్పనని తన విశ్వాసమనెను.

మిక్కిలి శీతలదేశమగు ఇంగ్లాండులో మాంసము దినకమనుట దుర్లభమని యతఁడనెను. "ఏమైనను, నేను మాంసము ముట్టను; మాఅమ్మకడ ప్రమాణముచేసితిని; మాంసభక్షణము తప్పదనుస్థితియె కల్గుచో, ఇంగ్లాండువిడిచి యింటికె మఱలుదును"—అని ఆయనకు సమాధానమిచ్చితిని.

మాయోడ సౌతాంప్టన్ రేవు చేరినది. తెల్లని ఉన్ని దుస్తులతో ఓడదిగితిని. అవి సెప్టెంబరునెల కడపటిరోజులు. అంతమందిలో అచట నట్టిదుస్తులు ధరించిన వాఁడను నే నొకఁడనే!

ఇంగ్లాండులోనున్న డాక్టర్ పి. జె. మెహతా, దల్పత్ రామ్ శుక్లా, రాజకుమారుఁడు రంజిత్ సింగ్జి, 'భారతపితామహుఁడు' దాదాభాయి నౌరోజి లకు నాకడ పరిచయలేఖలున్నవి. ఓడలోని ప్రయాణికులలో నెవ్వరో లండన్ నగరములోని విక్టోరియాహోటలునందు బసచేయుమని మాకు చెప్పిరి. మజుందార్జితో విక్టోరియాహోటలులో దిగితిని.

సౌతాంప్టనునుండియె నారాకను తెల్పుచు డాక్టర్ మెహతాకు తంతినంపితిని. నాఁటిసాయంతనమె ఆయన విక్టోరియాహోటలుకు వచ్చి నన్ను ప్రేమపూర్వకముగ పరామర్శించెను. నేను తెల్లని యున్ని దుస్తులు ధరించి యుండుటజూచి ఆయన నవ్వుకొనెను. సంభాషణ వశమున నేనాయన టోపీని తీసికొని యెంతమెత్తగనున్నదో చూడవలె ననుకొనుచు తెలియక చేతితో ఎదురురుద్దితిని. ఉన్ని చెదరినది! ఆయనముఖములో కోపముతొంగిచూచినది. ఈ సంఘటన నేను భవిష్యత్తులో జాగ్రత్త కల్గియుండుట కనువైన

హెచ్చరికమైనది. ఆంగ్లేయసమాజ మర్యాదలు తెలిసికొనుటలో నాకిది ప్రథమపాఠము. "ఇతరులవస్తువుల జోలికి పోరాదు; మనహిందూదేశములోవలె ఇచటనెవ్వరిని మొదటి పరిచయముననె ప్రసంగములోనికి దింపరాదు; బిగ్గరగ మాట్లాడరాదు; మనదేశములోవలె నిచట 'అయ్యా' అను సంబోధన మామూలుగవాడరాదు; ఇచట నౌకరులు, క్రింది యుద్యోగులు మాత్రమె తమయజమానుల నట్లు సంబోధించుదురు"—ఇత్యాదిగ, నాకాంగ్లేయుల సంఘమర్యాదలను గూర్చి మాటలసందర్భమున మెహతా చెప్పెను. హోటలులో డబ్బుఖర్చు యెక్కువ, కాఁబట్టి వేఱువసతి చూచుకొనుట మంచిదనియు అతఁడు సలహానిచ్చెను.

మా యోడలో ప్రయాణమొనర్చిన సింధురాష్ట్రీయు డొకఁడు మాకు పరిచయమైనాఁడు; అతనికి ఇంగ్లాండు సుపరిచితము. అతని సాయమున ఇంకొక చోట గదులుఅద్దెకు తీసికొని అచటికి బసమార్చగల్గితిని. అప్పటికి హోటలులో తిన్నదిలేకున్నను చెల్లింపవలసిన పద్దు పెద్దదైనది. బొంబాయి నుండి తెచ్చుకొన్న తినుబండారముల తోడనే అంతవరకు కాలము గడపితిని.

క్రొత్తచోటులో గదులుబాగున్నవి. కాని, నామనస్సు మాత్రము పరిపరివిధములుగ కలఁతజెందినది. ఇంటిదిగులు పెద్దదైనది. మా అమ్మమాట ననుకొనని క్షణమే లేదు. తలఁచుకొనినకొలఁది కన్నులు చెమ్మగిలెడివి. ఇంటిధ్యాసతో నిద్ర నిప్పచ్చరమైనది. నాఆవేదననెవ్వరితో చెప్పుకొనఁగలను? ప్రజలు - వారిపద్ధతులు - వాసస్థలములు అన్నియు నాకు

క్రొత్తయే. వారి సంఘమర్యాదలలో నాకు ' ఒనమా ' లైన రావాయె! నాశాకాహార నియమమునకు భంగము కలుగ రాదాయె! నేనుతినఁదగిన వస్తువులున్నవి; ఏమిప్రయోజనము? ఒక్కటియు రుచింపదు. ఏమనఁగలను? ఎట్లు మనగలను? ' ముందు చూచిననుయ్యి, వెనుకచూచినగొయ్యి!' ఇంగ్లాండు వాసమా భరింపరానిది; ఇంటికి తిరిగిపోవుటా తలంపరానిది! "ఏమో, ఏమైననాయె; ఇంగ్లాండునకు వచ్చితివి; వచ్చిన వాఁడవు మూఁడేండ్లు ముగించుకొనిన పిమ్మటఁగాని యింటికి పోవలదు", అని అంతర్వాణి బోధించినది.

# 9

నేను క్రొత్తబసకు మారినవెంటనె డాక్టర్ మెహతా నన్ను చూడవచ్చెను. నేనట్టిచోట నివసించుటవలన ప్రయోజనము లేదని అతఁడు సూచించెను. "మన దేశీయులు ఇంగ్లాండునకు వచ్చునది కేవలము పుస్తకములను చదువుటకు కాదు; ఆంగ్లేయుల జీవితవిధానమును, వారి ఆచార వ్యవహారములను తెలిసికొనుట ముఖ్యము ", అని అతఁడు నొడివెను. అందుకు ఆంగ్లకుటుంబముతో కలిసిబసచేయుట అవసరమనెను. తానెఱిఁగినయొక ఆంగ్లకుటుంబమున కొంతకాలము నాకుబస యిప్పింతుననియుఁ జెప్పెను.

మెహతాచేసిన సూచనను కృతజ్ఞతతో నంగీకరించితిని. ఆయనచెప్పిన మిత్రునికుటుంబముతో బసచేసితిని. ఆ మిత్రుఁడు నాయెడ మిక్కిలి శ్రద్ధవహించి తనతమ్మునివలె

నన్నాదరించెను. తమ సంఘమర్యాదలు మున్నగువానిని తెలియఁజేయసాగెను. ఆంగ్లమునఁ బ్రసంగింపుమని నన్ను ప్రోత్సహించెను. ఇంతకును భోజనముపట్ల చిక్కు వచ్చినది. వారిచప్పిడికూరలు నాకు రుచించలేదు. నాపని దాదాపుగ పస్తులెయైనది. మాంసముదినుమని అతఁడుసూచించెను. ఉన్నది కదా మా అమ్మకడ పెట్టుకొనినయొట్టు? కావుననే, ఆయన సలహాకు ససేమిరా యంటిని. మాంసభక్షణ మవసరమని, ఉపయోగకరమని ఆయన పదేపదే చెప్పెడివాఁడు. ఆయ నెంత చెప్పినను నేను దిగజాఱలేదు. "నాకు వ్రతభంగము రానీయకు" మని మాత్రము మనసులో భగవానుని ప్రార్థించుచుండెడివాఁడను.

ఒకసారి నా మిత్రుఁడు బెంథామ్ రచించిన 'థియరీ ఆఫ్ యుటిలిటీ' అను గ్రంథమును చదివి వినిపింపసాగెను. నాకది 'చెవిటివానిముందు శంఖు ఊదిన'ట్లైనది. ఆయన వివరణ జెప్పినను ఆసిద్ధాంతములు నాకుబోధపడలేదని చెప్పివేసితిని. 'ఇంగ్లాండులో మాంసభక్షణ మవసరమేనని నే నంగీకరించినను, నేనుమాత్రమువ్రతభంగమున కోర్వఁజాల'నని స్పష్టముగ చెప్పితిని. "నన్ను అవివేకి యనుకొనినను, మొండికట్టె అనుకొనిను మానేఁగాని, నన్నుమాత్రము బలవంతము చేయకు" మంటిని. "సలహా నామేలుకొఱకే చెప్పఁబడుచున్నను, నేను వినఁజాలను, వ్రతమును విడువఁజాలను" అని నొక్కి చెప్పితిని. నాఁటితో ఆయన మరల ఆప్రస్తావన చేయలేదు. నామాట పాటించినాఁడు. తాను మద్యము సేవించుచున్నను, పొగ త్రాగుచున్నను, నన్నుమాత్రము

వానిలోనికి దిగుమనలేదు. వానిజోలికి పోవలదనియుఁ జెప్పినాఁడు. పాపము, మాంసాహారములేనిచో నేను శుష్కించిపోవుదుననియు, దానివలన నా ఇంగ్లాండువాసము సుఖకరముగ నుండదనియు ఆయన ఆరాటము!

ఇట్లాయన సహచర్యములో ఒక నెల గడచినది.

# 10

నన్ను తనవాదన కనుకూలునిగ నొనర్చుటకు నా మిత్రుఁ డింకొకమార్గము వెదకెను. నేను మాంసాహారము నొల్లనిచో శరీరదార్బల్యమును పొందుటయెకాక ఆంగ్లసంఘములో కలసిమెలసియుండు అవకాశములనుగూడ పోఁగొట్టుకొందుననియు, ఇంగ్లాండు వాసమువలన తగిన ప్రయోజనము నొందకయె భారతదేశమునకు తిరిగిపోవుదుననియు, నాకై ఆయన ఆందోళన వెల్లడించెను.

మాంసాహారిని కానిలోపము కన్పడకుండ, నాగరక సమాజమున గౌరవముతో మెలఁగుట కవసరమైన తక్కిన పద్ధతులనన్నిటిని నేర్చుటకు యత్నింతునని ఆయనకు నమ్మఁబల్కితిని. అందు కనుకూలముగ, దుస్సాధ్యమైనను, ఆంగ్లేయునివలె తయారగుటకు ప్రయత్నించితిని.

బొంబాయిలో కుట్టించుకొని తెచ్చినబట్టలు ఆంగ్ల సమాజమున ధరించుటకు తగినంత నాజూకుగ లేవని, క్రొత్త రీతులెఱిఁగిన యొక దర్జీకడ మరల బట్టలు కుట్టించితిని. ఒక దానివెంట నొకటిగ టోపి, గడియారపుగొలుసు మొదలగు

వానిని కొంటిని. నిత్యము నిలువుటద్దముకడనిల్చి వేషము దిద్దుకొనఁ జొచ్చితిని. జుట్టు దిద్దుకొనుటయె పెద్ద సాహసమైనది.

నా అనుకరణాధ్యాయ మంతటితో నాఁగలేదు. అచ్చముగ నాంగ్లేయునివలె చెలామణి కావలయునన్న నాట్యము, ఫ్రెంచిభాష, వక్తృత్వములుగూడ నేర్చుట అవసరమనిపించినది. ఫ్రెంచిభాష ఐరోపాఖండమున సర్వసామాన్య భాష. ఐరోపాఖండమున సంచారము జేయవలెననియు నా కభిలాష. అనుకొనినట్లు, రుసుముచెల్లించి నాట్యము నేర్చుకొనుట ప్రారంభించితిని. కాని, ప్రయోజనమేమున్నది? మూఁడువారములు గడచినను నాట్యభంగిమల కవసరమైన పాదవిన్యాసము కొంచెమైనను నేర్చుకొనలేక పోతిని. 'పియానో' తో వరుస కలుపలేకపోతిని. ఇఁక నేమిచేయుదును? పూర్వమొక సన్యాసి ఎలుకల పోరుపడలేక పిల్లిని పెంచెనట. పిల్లికి పాలకై ఆవును, ఆవునుకాయుటకు నౌకరును—ఇట్లొక దాని వెంట నొకటిగసంసారము పెంచెనట! నాపనియు నటులెయైనది. పాశ్చాత్య సంగీతస్వారస్యము గ్రోలవలయునను తలంపుతో ఫిడేలుకొని పాఠములు మొదలుపెట్టితిని.



1890లో లండన్‌లో న్యాయశాస్త్రము చదువునప్పుడు

నక్తృత్వపాఠములకును ముడుపుచెల్లి నాందిజరిగినది. వక్తృత్వమును బోధించు పండితుని సలహాపై బెల్ రచించిన 'స్టాండర్డ్ ఎలొక్యూషనిస్ట్' అను గ్రంథమును కొని చదువ నారంభించితిని.

కథ అడ్డముతిరిగినది. నాకు జ్ఞానోదయమైనది. "నేను శాశ్వతముగ ఇంగ్లాండులో నివసింపఁబోవుట లేదుకదా, నాకీ వక్తృత్వమెందుకు? గౌరవప్రాప్తికి నాట్యమవసరమా? ఫిడేలును భారతదేశముననైన నేర్వవచ్చునుకదా? నేను వచ్చినది విద్యార్థిగ. బారిస్టర్ పరీక్షకు చదువక, ఇతర వ్యాసంగమంతయు పెట్టుకొనుట భావ్యమా? నా నైతిక వర్తనమువలన గౌరవము కల్గుచో నదియెచాలును. ఇవి యన్నియు నేల?"—అను తలంపులు నాలో తళుక్కున మెఱసినవి. నాఁటితో నాట్యమును చాలించితిని. వక్తృత్వాభ్యాసమునకు వీడ్కోలు చదివితిని. ఫిడేలు పాఠములను కట్టిపెట్టితిని. మొత్తమున కీ వ్యామోహమంతయు దాదాపు మూఁడు నెలల 'భాగవత'మైనది. వేషముపై 'వెఱ్ఱి'మాత్రము తరువాతగూడ కొన్నియేండ్లు పట్టుకొని ప్రాఁకులాఁడినది. ఏమైనను, అప్పటినుండి కేవలము విద్యార్థివలె నడచుకొంటిని.

# 11

నేను నాట్యము మొదలగువానిని నేర్చుకొనుటకు ప్రారంభించినది విలాసములపై బుద్ధి పుట్టుటవలనఁగాదు. కావుననే, వానిని విడచుటయు నాకు కష్టమనిపించలేదు. ఈ

మార్పుతో సరిపెట్టుకొనక, నా మామూలు ఖర్చులనుగూడ బాగుగ తగ్గించుకొనవలె ననుకొంటిని. ఇతరుల యింటిలో బస పెట్టుకొనియుండుటవలన వారికి ప్రతివారము డబ్బు చెల్లింపవలసియున్నది. కాఁబట్టి ప్రత్యేకముగ రెండు గదుల నద్దెకు తీసికొంటిని. క్రొత్తస్థలము నాపనులున్న చోటికి దగ్గఱగ నుండుటచే బండిఖర్చులు కలిసివచ్చినవి. ప్రతిదినము దాదాపు పదిమైళ్లు నడకయు నుండెడిది. ఖర్చు తగ్గుటతో బాటు కాలి నడకవలన కాయపటుత్వము గల్గినది. 'ఒక్క వ్రేటుకు రెండు పిట్టలు, దక్కినవి. మొత్తముమీఁద ఇంగ్లాండులో నున్నంత కాలము జబ్బుచేసి యెఱుఁగను.

నాకు తీఱుబడియు హెచ్చుగనున్నది. దానిని సద్వినియోగము చేయవలెనని నా యభిలాష. బారిస్టర్ పరీక్షకు ఎక్కువగ చదువవలసిన అవసరములేదని యెఱుఁగుదును. ఆంగ్లభాషలో నాకు చాలినంత పరిజ్ఞానములేదు. అందువలన ఏదైన మఱియొక పరీక్షకు చదువవలెననుకొంటిని. ఆక్స్‌ఫర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయముల పట్టములనుగూర్చి విచారించితిని. వానికి చదువుచో ధనవ్యయము మెండనియు, నే ననుకొనినదానికంటె ఎక్కువకాలము ఇంగ్లాండులో నుండవలసియుండుననియు తెలిసికొని వానిమాట విరమించితిని. ఒక స్నేహితుని సలహాపై లండన్ మెట్రిక్యులేషన్ పరీక్షకు చదువుటకు నిర్ణయించుకొంటిని. ఆ పరీక్షకు నిర్ణయింపఁబడిన పాఠ్యవిషయములనుచూచి తొలుత డీలుపడితిని. వానిలో లాటిన్ భాష, ఒక ఆధునికభాషగూడ చదువవలెను. లాటిన్ భాష అనినవెంటనె నాకు 'పచ్చివెలగ గొంతునబడినట్లు' అయి

నది. కాని, న్యాయవాదులకు లాటిన్ భాష మిక్కిలి యుపయోగకరముగ నుండునని నామిత్రుఁడు గట్టిగ నచ్చఁజెప్పెను. తుదకు, లాటిన్ చదువుటకు సమ్మతించినాను. ఆధునికభాషకు ఇంతకుమున్నె మొదలుపెట్టిన ఫ్రెంచిభాష యుండనేయున్నది. అప్పటికి పరీక్షకున్నవ్యవధి ఐదు నెలలు మాత్రమే. కష్టించి చదివితిని. కాని లాటిన్ భాషలో 'బండి బోల్తాపడినది'. మెట్రిక్యులేషన్ పరీక్ష యేఁడాదికి రెండుమార్లు జరుగును. రెండవమాఱు పరీక్షలో ఉత్తీర్ణుఁడనైనాను.

నా పటాటోపము నింకను తగ్గించుకొనఁబూనితిని. నా ఖర్చులు మాకుటుంబపు ఆదాయమునుమించిన దామాషాలో నుండుట గుర్తించితిని. కష్టమనుకొనక, నేను కోరినపుడెల్ల డబ్బు పంపించుచుండిన మా అన్నయ్య ఔదార్యము నాలో చైతన్యము దెచ్చినది. నాకంటె మిక్కిలి తక్కువ ఖర్చుతో జీవితము గడపుచున్నవారిని చూచుచున్న నాకు వారి ననుసరింపవలెనని బుద్ధిపుట్టినది.

రెండు గదులకుబదులు ఒకేగదితో కాలము గడుపవచ్చుననుకొంటిని. వంట నేనేచేసికొనవచ్చును. ఇట్లయినచో నెలకు 4 లేక 5 పౌనులు ఖర్చుతగ్గును. అనుకొనిన మార్పును వెంటనే ఆచరణలోనికి తెచ్చితిని. బస ఒకగదియేయైనది. అక్కడనె సొంతముగవంట. ఓట్లజావతో, కోకోతో ఉదయము భోజనము ముగించెడివాఁడను. మధ్యాహ్నము భోజనమెక్కడనైన హోటలులో. మరల రాత్రిభోజనము స్వయంపాకమే—రొట్టె, కోకో. ఇట్లు రోజుకు 15 పెన్నీల ఖర్చుతో జీవితము గడుపఁ జొచ్చితిని.

ఇన్నిపనులున్నను చదువు బాగుగసాగినది. నిరాడంబర జీవితములో కాలము కలిసివచ్చినది. పరీక్షలో కృతార్థుడనైతిని. ఈమార్పు నాకు భారమనిపించలేదు; నా బాహ్య–అంతర జీవనవిధానమున మంచిసామరస్యము సంఘటించినది. నా జీవితము ఎక్కువ సత్యబద్ధముగ తోచినది. అంతరాత్మ ఆనందమందినది.

## 12

నాదైనందిన జీవితపద్ధతులలో గల్గిన మార్పులతో బాటు, నా ఆహార విషయమునగూడ మార్పుగల్గినది. శాకాహార విషయమునుగూర్చి విశేషముగ తెలిసికొనసాగితిని. ఇంగ్లాండు శాకాహారుల సంఘమువారి వారపత్రికను చందాకట్టితిని. వారి సంఘమున సభ్యుడుగ చేరితిని. అచిరముననె నాకా సంఘకార్యవర్గమున స్థానములభించినది.

మిఠాయీలు, ఊరుగాయలు, కాఫీ, తేనీరుల నుపయోగించుట మానుకొంటిని. హెచ్చుగరొట్టె, కోకో, ఉడకబెట్టిన కూరలే ఆహారమైనవి. మనసునకు నచ్చినచో ఏ పదార్థమైనను రుచిగనుండునని గ్రహించితిని.

వివిధమతముల గూర్చియు తెలిసికొనసాగితిని. దివ్యజ్ఞాన సామాజికులగు ఇద్దరు మిత్రుల ప్రోత్సాహమున సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్ రచించిన భగవద్గీత ఆంగ్లానువాదము— 'సాంగ్ ది సెలెస్టియల్'—ను చదివితిని. అంతకుముందు గీతనెన్నడు చదువలేదని చెప్పుకొనవలసి వచ్చినందుకు సిగ్గిలితిని.

గీతనుచదివి ముగ్ధుఁడనైతిని. అందలి ద్వితీయాధ్యాయము లోని కొన్నిశ్లోకములు నా మనస్సులో గాఢముగ నాటు కొనినవి. నేఁటికిని అవి చెవులలో మాఱ్ఱోగుచున్నవి. వాని భావమిది: “నిరంతర విషయచింతనమున మానవుఁడు తత్సంగుఁ డగును. దానివలన కామము, కామమువలన క్రోధము, క్రోధమువలన మోహము, మోహమువలన మతి భ్రమణము, దానివలన బుద్ధినాశనము కల్గును. బుద్ధినాశనము వలన సర్వనాశనము సంభవించును.”

గీత అమూల్యమైన నిక్షేపము. నిరాశ, నిస్సహాయత్వ తోఁచిన సమయములలో గీతాపఠనము నాకు మిక్కిలి యుపకరించెడిది.

ఒక క్రైస్తవమిత్రుని సలహాపై వారి పవిత్రగ్రంథ మగు బైబిలుచదివితిని. అందలి కొన్నిఘట్టములు నన్ను చకితుని జేసినవి. “...ఎవరైనను కీడుచేసిన వో ప్రతిఘటింప కుము. కుడిచెంపపై కొట్టిన వో, ఎడమచెంప చూపుము...” అనిన బైబిలుసూక్తి నన్ను తన్మయుని గావించినది. అదిచదివినపుడు, “అపకారికిని ఉపకారము జేయుము” అని ప్రబోధించుచు గుజరాతకవి శ్యామలభట్టు రచించిన గీతిక స్ఫురణకు వచ్చినది.

ఇంగ్లాండులో నేనుండిన ఆఖరు సంవత్సరములో నన్ను, నా మిత్రుని పోర్ట్సుమత్ లో జరుగు శాకాహారులసభ కాహ్వా నించిరి. మేమచటదిగిన విడిది గౌరవనీయ మైనదికాదు. పాపము, ఆహ్వానసంఘమువారి కావిషయము తెలియదు.

రాత్రి భోజనమైనపిదప పేకాటపెట్టితిమి. ఇంటియజమాను రాలు మాతోపాల్గొన్నది. మాలోకొందఱు ఛలోక్తులు ప్రారంభించిరి. నా స్నేహితుఁడు, ఇంటి యజమానురాలు 'మూఁడాకులుపైన చదివిరి'. అసభ్యములగు ఛలోక్తులలో దిగిరి. నేనును ఆవ్యామోహములోఁ దగుల్కొంటిని. హద్దు దాటనుంటిని. చప్పుననామిత్రుఁడు నన్నుగట్టిగమందలించెను. పరమేశ్వరుఁడే నా మిత్రునిద్వారా నేను పాపకుండమునఁ బడకుండ సముద్ధరించెను.

నా ప్రవర్తనకు నాకేసిగ్గుతోఁచినది. నన్నుమందలించి కాపాడిన మిత్రునియెడ కృతజ్ఞతగల్గినది. మా అమ్మకడ చేసివచ్చిన శపథమును జ్ఞాపకము దెచ్చుకొంటిని. తలవంచి మెల్లగ ఆచోటునుండి తప్పుకొంటిని.

నా కానాఁటికి మతములోని పరమార్థమేమియో, భగంతుఁడన నేమియో స్పష్టముగ తెలియదు. కాని, ఆ సమయమున భగవానుఁడే నన్ను కాపాడెనని మాత్ర మూహింపఁ గల్గితిని. చాలసార్లు అట్టివిషమ సమయములలో చెడత్రోవలఁ బడకుండ అతఁడె నన్నురక్షించెను. ఇతర సహాయకులులేక నేను నైరాశ్యమున క్రుంగినకొన్ని సమయ ములలో అట్టిసహాయమువచ్చుట నాకనుభవమే. ప్రార్థనలు, అర్చనలు మొదలగునవి వెఱ్ఱినమ్మకములుకావు; కూర్చుండుట,

నడచుట మొదలగు మన తక్కిన అనుభవముల వలె యదార్థములే.

# 13

నా చదువు పూర్తియై 1891వ సంవత్సరము జూన్ నెలలో బారిష్టర్ పట్టము దీసికొంటిని. వెంటనే ఓడలో స్వదేశమునకు ప్రయాణమైతిని. హిందూదేశపు న్యాయశాస్త్ర పరిజ్ఞానము లేకపోయెనేయని, న్యాయవాదవృత్తి ప్రోత్సాహకరముగ నుండదేమోయని లోలోన పరితాపము లేకపోలేదు. ఏడెన్ రేవు విడిచినప్పటినుండి ప్రయాణము సాఫీగజరుగలేదు. మా ఓడలో దాదాపుగ అందఱకు సుస్తిచేసినది. మంచి ఆరోగ్యమున నున్నది నేనొక్కఁడనే.

బయట సముద్రములో చెలరేగుచున్న తుపాను మానవుని మనసులోని కల్లోలమునకు సూచనయని తోఁచినది. ఏమైనను, నేనుమాత్రము చలించలేదు.

మా అన్నయ్య రేవుదగ్గఱకు ఎదురు వచ్చినాఁడు. మా అమ్మ మరణవార్త నాకప్పుడె తెలిసినది. దూరదేశమున నున్నపుడు ఆవార్త నాకు తెల్పి బాధకల్గింపనెంచక, అతఁడప్పటి దాక ఆవార్త తెలుపలేదు. ఏమైనను, ఆవార్తనాకు పిడుగు పడినట్లైనది. నాఆశలు భగ్నమైనవి. ఎట్లో దుఃఖమునణఁచుకొని, మామూలు ధోరణిలోఁ బడితిని.



బారిస్టర్ ఉడుపులలో

కొన్నాళ్లు రాజకోటలో గడపితిని. బొంబాయి హైకోర్టులో అనుభవము సంపాదించుట మేలని, అచట నున్నచో హిందూదేశ న్యాయశాస్త్రమును బాగుగ చదువుట కవకాశముండునని, అచటనె న్యాయవాదవృత్తి నెఱపుమని కొందఱుమిత్రులు సూచించిరి. వారి సలహా ప్రకారము బొంబాయి నగరము జేరితిని.

బొంబాయిలో ఖర్చు యెక్కువ; ఆదాయము తక్కువ. అచట నాల్గు, ఐదు నెలలు వెళ్లఁదీయుటయె కష్టమైనది. 'మూట, ముల్లె కట్టుకొని' తిరిగి రాజకోటకు వచ్చితిని.

రాజకోటలో నాపని కొంచెము మేలనిపించినది. దాదాపుగ నెలకు మూఁడువందల రూపాయిలవఱకు గిట్టుబడి యైనది. ఆ వరుమానమునకు నా ప్రతిభ కంటె, మా పలుకు బడియె యెక్కువ కారణమనుకొందును.

# 14

కథియవాడు కుతంత్రవాతావరణము కొద్దికాలమునకె నాకు 'తలనొప్పి' అనిపించినది. అంతలో నేను దక్షిణాఫ్రికాకు వెళ్లు అవకాశము లభించినది.

పోర్బందరువారి వ్యాపారసంస్థ—దాదా అబ్దుల్లా కంపెనీ—దక్షిణాఫ్రికాలో నున్నది. వారింకొక కంపెనీపై 40,000 పౌనులకు దావావేసిరి. ఆ వ్యాజ్యెములోఁ బని చేయుచో నాకు ఖర్చులన్నియు భరించి, యేఁడాదికి 105

పౌనులు 'ఫీజు' నిత్తుమనిరి. 1893 వ సంవత్సరము ఏప్రిల్ నెలలో దక్షిణాఫ్రికాకు బయలుదేఱితిని.

డర్బాన్ రేవులో నాకై అబ్దుల్లాసేఠ్ యెదురువచ్చెను. ఓడలోని తక్కిన ప్రయాణికుల మిత్రులును పెక్కురువచ్చిరి. వారినందఱినిచూచి నేను గ్రహించినదొకటి: భారతీయులను అచటి ఐరోపియనులు చుల్కనగ చూచుచుండిరి. అబ్దుల్లాసేఠ్ ఐరోపియనుపరిచయులును అతని నేమోతక్కువగచూచుటయు గమనించితిని. నా మనసు చివుక్కుమన్నది. అతనికి మాత్ర మట్టిస్థితి మామూలైనది. అందఱు నన్ను, నా వేషమును వింతగ చూడసాగిరి.

అబ్దుల్లాసేఠ్ నన్ను తమకార్యాలయమునకు తీసికొని పోయెను. తన మకాముదగ్గఱనె నాకును బస చూపించెను. అతఁడు నా వాలకమునుబట్టి నాకు ఖర్చు లెక్కువయగునని గ్రహించెను. 'వాములుమ్రింగుస్వామి' వచ్చె నేమాయని కొంత తటపటాయించెను. ఇంతకును అక్కడ వెంటనే నేను చేయఁదగిన పనియుఁ గన్పట్టలేదు. దావా జరుగుచున్నది ప్రిటోరియాలో. మఱి నేనక్కడనె మకాము పెట్టవలెగదా? ప్రతివాదులున్నదియు అక్కడనే. ఏమో, వారు 'లోపాయ కారిగ' నన్ను తమపక్షమునకు ద్రిప్పుకొందురేమో, అబ్దుల్లా సేఠ్ ఎట్లు నమ్మగలఁడు? క్రొత్తవానికి నా నిజాయతీ యెట్లు తెలియును?

అబ్దుల్లాసేఠ్‌కు చదువులొచ్చు; అయినను అనుభవము హెచ్చు. మంచి తెలివితేటలున్నవి. అతఁడు కొంచెము ఇంగ్లీషులోగూడ మాట్లాడగలఁడు. దానితో కంపెనీవ్యవ

హారములనుగూడ చూచుకొనును. అచటి పెద్ద భారతీయ వ్యాపారసంస్థలలో వారిదొకటి. అబ్దుల్లాసేఠ్ అనిన అచటి భారతీయులకు మంచి గౌరవమున్నది.

ఒకనాఁడు అబ్దుల్లాసేఠ్ డర్బాను కోర్టును చూపించుటకు నన్ను వెంటఁ దీసికొనిపోయెను. చాలమందికి నన్ను పరిచయముజేసెను. మేజస్ట్రేటునన్ను తదేకదృష్టితోచూచి చూచి 'తలగుడ్డ' తీయుమనెను. తలగుడ్డను తీసి వేసుకొనుట కంటె కోర్టును విడచుటయె మేలని వెంటనె లేచివచ్చితిని.

అక్కడను నాకు పోరాటము తప్పదనిపించినది. ఆఫ్రికాలో కాలుపెట్టి అప్పటికి రెండురోజులే!

మహమ్మదీయ వేషముననున్నఁ దప్ప, భారతీయులు తలగుడ్డ తీసివేయవలయునను అక్కడినియమమును తరువాత అబ్దుల్లాసేఠ్ నాతోఁజెప్పెను. తలగుడ్డను తీసివేయుట అవమానకరమైన విషయము. తీయకున్న? ఈ బాధను తప్పించుకొనుటకు ఆంగ్లేయుని పద్ధతిలో టోపి ధరింపఁదలఁచితిని. కాని, అబ్దుల్లాసేఠ్ సలహాపై ఆప్రయత్నమును విరమించితిని.

కోర్టులో జరిగిన 'తలగుడ్డతగాదా' నుగూర్చి వార్తాపత్రికలకు వ్రాసితిని. దక్షిణాఫ్రికాకు నారాక 'పిలువని పేరంట' మని పత్రికలు వ్యాఖ్యానించినవి. నన్ను సమర్థించినవారును కొందఱు లేకపోలేదు. ఏమైనను, కొలఁదిరోజులలోనె నాకు అనుకొననంత ప్రచారము వచ్చినది.

అబ్దుల్లాసేఠ్ గారి దావాలో పనిచేయుటకై ప్రిటోరియాకు పోవలసి వచ్చినది. ఒకటవతరగతి టిక్కెట్టుకొని రైలెక్కితిని. రైలుబండి మారిట్జ్‌బర్గ్ పట్టణముచేరినది.

మారిట్జ్‌బర్గ్ నెటాలుకు ముఖ్యపట్టణము. ఒక ప్రయాణికుఁడు నేనున్న పెట్టెలోనికివచ్చి నన్ను 'ఎగదిగ' చూచెను. నేను 'నల్లవాఁడ' నగుటచే అతనికి జెబ్బులు ప్రాఁకినట్లయ్యెను. అతఁడు చప్పున తిరిగివెళ్లి రైల్వే ఉద్యోగులను కొందఱిని వెంటఁబెట్టుకొని వచ్చెను. వారిలోనొకఁడు నన్ను ఆ ఒకటవ తరగతి పెట్టెనుండిదిగి తక్కువతరగతి పెట్టెలోనికి పొమ్మనెను. నాకు ఒకటవ తరగతి టిక్కెట్టు ఉన్నదంటిని. "అయినను, దిగకతప్పదు; లేకున్న పోలీసునుపిలిచి క్రిందికి లాగింతు"నని అతఁడనెను. 'ఏమైనఁగానిమ్ము; నేనుదిగ'నంటిని. ఏమైనది? పోలీసువచ్చి నన్నుబయటికి గెంటివేసెను. నాసామానును క్రిందికి గిరాటువేసెను. ఇంకొక పెట్టెలో నెక్కుటకు నేనిష్ట పడలేదు. రైలుపోయినది! అప్పటికినేను ఆఫ్రికాలో కాలిడి ఒక్కవారమే!

అది శీతకాలము. అందురాత్రి. చలికి గిజగిజవణఁకుచు స్టేషనులో అల్లై కూర్చుంటిని. నాకేఁక కర్తవ్యము? నా హక్కును నిలబెట్టుకొనుటకు సమరమా? కిక్కురుమనకుండ అక్కడినుండియే స్వదేశమునకు తిరిగి ప్రయాణమా? అవమానములను సరకుగొనక ప్రిటోరియాకు వెళ్లి, పనిపూర్తి చేసికొని స్వదేశమునకు పోవుటా?— వీనిలో నేది చేయఁదగినది? ఆలోచించితిని. ఆఖరుకు నిశ్చయించితిని. పూని వచ్చినపనిని విడిచి పాఱిపోవుట పందపని; వచ్చిన పనిని పూర్తిచేయుదును. వీలైనంతవఱకు ఇచటి జాతివిద్వేషమును తొలఁగించుటకు యత్నింతును—అని.

మఱునాటియుదయమె ఆ సంఘటనమునుగూర్చి రైల్వే జనరల్ మేనేజరుకు తంతిద్వారా తెలియజేసితిని. అబ్దుల్లా సేట్‌కుగూడ తెలియఁజేసితిని. అతఁడు స్వయముగ జనరల్ మేనేజరుతో మాట్లాడినాఁడు. కాని, జనరల్ మేనేజరు రైల్వే ఉద్యోగులచర్యనే సమర్థించినాఁడు.

అబ్దుల్లాసేట్‌వలన విషయమునువిని మారిట్జ్‌బర్గులోని భారతీయవర్తకులు కొందఱు నన్ను పరామర్శించుటకు స్టేషనుకువచ్చిరి. తెల్లవారి చేతులలో భారతీయులిట్టి అవమానములను, అగచాట్లను పొందుట పరిపాటియైనదని వారివలన తెలిసికొంటిని. సాయంత్రము రైలులో ప్రిటోరియాకు వెళ్లితిని.

# 15

1893 వ సంవత్సరమునాఁటికే దక్షిణాఫ్రికాలోని భారతీయుల దుస్థితినిగూర్చి తెలిసికొనఁగల్గితిని. మఱుసటి సంవత్సరమే దాదా అబ్దుల్లా కంపెనీవారి దావా తృప్తికరముగ పరిష్కారమైనది. నేను డర్బానుకు తిరిగివచ్చి స్వదేశమునకు ప్రయాణమైతిని. ఆ సందర్భమును పురస్కరించుకొని అబ్దుల్లా నాకు వీడ్కోలువిందు నేర్పాటుచేసెను. విందువేళ 'నెటాల్ మెర్క్యూరీ' అనుపత్రిక నెవ్వరో నాకిచ్చిరి. అచటి భారతీయులకు ఓటుహక్కును రద్దు చేయుటకై నెటాల్ శాసనసభలో ప్రవేశపెట్టఁబడిన 'బిల్లు'ను గూర్చి అందున్నవార్త నాకన్నులఁబడినది. దానితో నచటి

భారతీయులకున్న ఆపాటి హక్కుగూడ సున్నయగును. కర్తవ్యము? నా ప్రయాణము నప్పటికి విరమించితిని. బిల్లును త్రోసివేయుడనికోరుచు ఆరాత్రియె శాసనసభకు పెద్ద మహాజరు తయారుచేసితిని. అబ్దుల్లా అధ్యక్షుడుగ నొక సంఘమును నియమించి, బిల్లును చర్చించుట వాయిదా వేయుడనికోరుచు ప్రభుత్వమునకు తంతినంపితిమి. దక్షిణాఫ్రికాలో భారతీయులు శాసనసభకు మహాజరుపంపుట కదియె మొదటిసారి. బిల్లును అరికట్టలేకపోయినను, మహాజరు కొంత సంచలనము దెచ్చినది. భారతీయులలో గొప్పచైతన్యము వచ్చినది. దినదినము సభలు జరుగసాగినవి. బిల్లును ప్రతిఘటించు ఆందోళన పెరిగినది. ఉద్యమమున కవసరమైన డబ్బుకు, స్వచ్ఛంద సేవకులకు కొఱతలేకపోయినది. నెల రోజులలో పదివేల సంతకములతో అప్పటి ఆంగ్లేయ వలస రాజ్యముల శాఖామాత్యుడగు రిప్పన్ ప్రభువుకు పెద్ద మహాజరు నంపితిమి. అప్పటికి నేనచటచేయదగిన పనిపూర్తియైనదనుకొని, స్వదేశమునకు ప్రయాణము కానెంచితిని.

ప్రయాణమై "సెలవిం"డని మిత్రుల నడిగితిని. "మాహక్కులకై పోరాడుమార్గమును చూపితిరి; మాలో ఉత్సాహమున్నను, తగిననాయకుడు లేనిదే యేమిసాధింపగలము? మీరే నాయకత్వమువహించి ఉద్యమము నడుపఁ గోరెదము," అని వారనిరి. వారిమాట కాదనలేకపోతిని. నా ప్రయాణమునకు మరల వాయిదాపడినది.

భారతీయుల యోగక్షేమముల నరయుట కొక సుస్థిరమైనసంస్థ అవసరమని యూహించితిని. దానితో 1894వ

సంవత్సరము మే నెలలో నెటాల్ ఇండియన్ కాంగ్రెసును స్థాపించితిమి. దక్షిణాఫ్రికా నాకు కార్యరంగమగుటకు, జాతీయగౌరవ రక్షణకై పోరాటము జరుగుటకు నది పునాది యైనది.

నెటాల్ భారతమహాసభ యెదుర్కొనిన వివిధక్లిష్ట పరిస్థితులను వివరించుటకంటె ఇక్కడ ఒక్కమాటమాత్రము చెప్పినచాలును. అన్ని అడ్డంకులుదాటి, ప్రభుత్వోద్యోగుల దాడికి తట్టుకొని, సంస్థఅభివృద్ధి పొందినది. భారతీయులలో తమలోపములను కప్పిపుచ్చుకొనుట, 'గోరంతలుకొండంతలు'గ చెప్పుకొనుట, అను అలవాటులు విరమింపఁబడుటకు తగిన చర్యదీసికొంటిమి. ఆత్మగౌరవమునకు భంగములేని పక్షమున ఐరోపియనుల విమర్శనములను గ్రహించితిమి. భారతీయో ద్యమమునకు పత్రికల మూలమునను ప్రచారము దెచ్చితిమి. అక్రమ విమర్శనలను మాత్రము నిశితముగ ఖండింపక మానలేదు.

## 16

నాదక్షిణాఫ్రికా నివాస మప్పటికే మూఁడేండ్ల పాటైనది. పలువురతో పరిచయమేర్పడినది. నా న్యాయవాద వృత్తిలో వరుమానమును బాగుగనేయున్నది. నేనచటనె యుండవలెనని అచటిభారతీయులు కోరిరి. అటులె నిలిచిపోవఁ దలఁచి, భార్యా పుత్రులను తీసికొనిపోవుటకు స్వదేశమునకు వచ్చితిని.

నా భార్యను, ఇద్దఱుకొడుకులను వెంటఁ బెట్టుకొని 1896 వ సంవత్సరము డిసెంబరు నెలలో దక్షిణాఫ్రికాకు తిరిగి వెళ్లితిని. దాదా అబ్దుల్లా తాను క్రొత్తగకొన్న పొగయోడలో నాకు, నా కుటుంబమునకు ఉచితముగ ప్రయాణసౌకర్యము గల్పించెను. బొంబాయి రేవునుండి డర్బానుకు మా యోడవెంట నింకొక యోడయు బయలు దేఱినది. మొత్తమున రెండిఁట రమారమి 800 మంది ప్రయాణికులున్నారు. వారిలో చాలమంది ట్రాన్స్వాల్ రాష్ట్రము జేరవలసినవారు.

ఇఁక నాలుగురోజులు ప్రయాణించినచో డర్బాన్ చేరెడివారమె. కాని, అంతలో-రానున్న అసలు తుపానుకు సూచనయో యనినట్లు - సముద్రమున పెద్దతుపానుసాగినది. అంతకంతకు ప్రచండమైనది. ఓడలోని ప్రయాణికులందఱు 'ప్రాణములను అఱచేతఁబెట్టుకొనినారు'. ఓడ ఉయ్యాలవలె ఊఁగుచున్నది. సముద్రము అల్లకల్లోలముగనున్నది. పెనుగాలి వీచినది. పెళ పెళ ధ్వనులు వినబడినవి. ఓడ మునిఁగిపోవుచున్నట్లు, బ్రద్దలగుచున్నట్లు భయము. ఆ నాఁటితో ప్రయాణికుల కందఱకు సముద్రముననె శాశ్వతసమాధి యనిపించినది. జాతి, కుల, మత భేదములులేక అందఱకు భగవన్నామస్మరణ వచ్చినది. సరంగు ధైర్యముజెప్పుచున్నను ఎవ్వరికిని గండముగడచి గట్టెక్కుదుమను నమ్మకమే లేక పోయినది. దృశ్యమెంత భీభత్సముగనున్నను నేనుమాత్రము ధైర్యము విడువలేదు. ఇట్టి ఘట్టము లంతకుమున్ను నాకను భవమె. ప్రమాదము తప్పుననియు, భయపడకుడనియు

తోడిప్రయాణికులకు చెప్పుచుంటిని. సరంగునుండి యెప్పటి కప్పుడు పరిస్థితి తెలిసికొని వారికెఱింగించు చుంటిని. ఎంత చెప్పినను వారి భయము భయమే. ఈ విషమస్థితి రమారమి 24 గంటలుండెనని జ్ఞాపకము. అప్పుడు మబ్బువిచ్చినది. తుపానుతగ్గినది. సూర్యుఁడు దర్శనమిచ్చినాఁడు. అందఱి ముఖములపై ఆనంద రేఖలు తొంగలించినవి. భగవన్నామ స్మరణమాత్రము అంతలోనె మాయమైనది! ఆపదతప్పినని అపుడును ఏవియో ప్రార్థనలు జరిపిరి. కాని, వానిలో అంతకుముందు ఆపత్సమయమునఁ జూపిన నిశ్చలత్వము, నిర్మలత్వము కన్పించదు.

ఓడలు రెండును డర్బాను రేవులో లంగరు వేసినవి. అసలు తుపాను ఆరంభమగున దింక నే!

# 17

ఇరువదిమూఁడు రోజుల ప్రవాసానంతరము ఓడ దిగినాము. అచ్చటి తెల్లవారు నామీఁదమిక్కిలి క్రోధముతో నుండిరనియు, నాకుప్రాణాపాయము కలుగు పరిస్థితిఏర్పడిన దనియు, నా కుటుంబముతో నేను రహస్యముగ పట్టణము లోనికి పోవుటమంచిదనియు ప్రభుత్వ సభ్యుఁడగు ఎస్కోంబ్ చెప్పవచ్చెను. ఎస్కోంబ్ తెచ్చిన సమాచారమును సరంగు నా కెఱింగించెను. అప్పటి కటులె చేయవలెనని నేననుకొనుచుం టిని. అంతలో లాటన్ అను ప్రసిద్ధన్యాయవాదివచ్చి, నాకుటుం బమును రుస్తుంజీ యింటికి పంపుమని, నన్ను తనవెంటఁ గొని

పోవుదునని, ప్రమాదము కల్గు పరిస్థితి లేదని చెప్పెను. నేను రహస్యముగ పట్టణములోని కేగుట గౌరవప్రదము కాదనియు అతఁడనెను. అతని సలహా నాకు నచ్చినది. నా భార్యను, బిడ్డలను ముందుగ రుస్తుంజీ యింటికంపి, నేను లాటన్ వెంట బయలు దేఱితిని.

నన్ను చూడగనె తెల్లవారి గుంపులనుండి 'గాంధి! గాంధి!' అను పెద్ద కేకలు సాగినవి. గుంపులు త్రోసికొని వచ్చుచుండెను. నన్ను రిక్షాలో ఎక్కించవలెనని లాటన్ ప్రయత్నించెను. గుంపులోనివారు రిక్షావానిని బెదరించి తఱిమివేసిరి. లాటన్‌ను దూరముగ లాగుకొనిపోయిరి. గుంపులునన్ను చుట్టుముట్టినవి. నాపై రాళ్లు, కుళ్లిన గ్రుడ్లు వర్షించినవి! నా తలపాగను లాగివేసిరి. నన్ను కాళ్లతో, చేతులతో చితుకఁగొట్టిరి. స్మృతిదప్పి క్రిందపడినాను. ఊపిరిబీల్చుకొనుటకైన వ్యవధిలేనట్లయినది. తన్నులు, గ్రుద్దులు నాపై గురిపించిరి. అంతలో, ఆ దారివెంటఁ బోవుచున్న పోలీసు సూపరింటెండెంటు భార్య – అలెగ్జాండరుసతి – వచ్చి నన్నాదుకొన్నది. ఆమె గొప్పధైర్యము బ్రకటించినది. నన్ను రక్షించుటకై గుంపుకు అడ్డమునిల్చినది. ఆమెనుచూచి వారు కొంచెము వెనుదీసిరి.

నా దుస్థితిజూచిన భారతీయయువకుఁడొకఁడు పోలీసు స్టేషనుకు పరుగెత్తి నా సమాచార మెఱిఁగించెను. సూపరింటెండెంటు అలెగ్జాండరు రక్షకభటులనంపెను. వారువచ్చినతోడనే వారివెంట బయలుదేఱితిని. నన్ను పోలీసుస్టేషనులో కొంతసేపు తలదాఁచుకొనుమని అలెగ్జాండరు సూచించెను.

"నన్ను హింసించినవారు తమ తప్పును తాము తెలిసికొని శాంతింపకపోరు; నాకు భయము లేదు" అని సమాధానమిచ్చి, నేనుసూటిగ రుస్తుంజీ భవనము జేరితిని. అప్పటి కక్కడనున్న డాక్టర్ దాది బర్జోర్ వలన నా గాయములకు చికిత్స పొందితిని. సాయంతనమైనది. రుస్తుంజీ యింటిచుట్టు తెల్లవారి గుంపులు తయారైనవి. ప్రొద్దుగడచినకొలఁది గుంపులు హద్దుమీరుచున్నవి. 'గాంధిని మాకుఅప్పగించండి' అని పెద్ద కేకలు సాగినవి. పరిస్థితి నెఱిఁగి పోలీసు సూపరింటెండెంటు అక్కడకువచ్చెను. అతఁడు చమత్కారముగ గుంపుల ఉద్రేకమును తగ్గించుటకు ప్రయత్నించినాఁడు. "మీమిత్రుని భవనమును, మీ కుటుంబమును రక్షించు కొనవలెనను ఉద్దేశ్యమున్నచో వెంటనె మారు వేషమున ఇంటినుండి వెళ్లి పొమ్మ"ని అతఁడు రహస్యముగ నాకు లోనికి కబురంపెను.

సూపరింటెండెంటు సలహా ప్రకారము భారతీయ రక్షకభటుని వేషము ధరించితిని. నావెంట నుండుటకు ఇద్దఱు ప్రభుత్వ గూఢచారులును మారు వేషములతో వచ్చిరి. వారివెంట రహస్యముగ ఇలువిడిచి పోలీసుస్టేషను కేగితిని.

అంతదనుక గుంపులను లాలించి అదుపులోనికి తెచ్చిన అలెగ్జాండరు నెమ్మదిగ 'గాంధి పాఱిపోయినాఁడ'ని వెల్లడించెను. ఇంటిని సోదాచేసి, నే నచట లేకుండుటను స్థిరము జేసికొని, విధిలేక గుంపులు కదలిపోయినవి.

నన్నుహింసించిన దుండగీండ్రపై చర్యదీసికొనుమని నాఁటి బ్రిటిష్ వలసరాజ్యముల శాఖామాత్యుఁడు ఛాంబర్లెన్ నెటాలు ప్రభుత్వమును కోరెను. నెటాలు ప్రభుత్వపు సభ్యుఁడు

ఎస్కోంబ్ నన్ను పిలిపించి నాకా సమాచారము దెల్పుచు, నాకు గాయములు కల్గినందుకు తన సంతాపమును వెల్లడించెను. దుండగీండ్రను నేను గుర్తుపట్టగల్గినచో వారిపై చర్య దీసికొందుననెను. 'నేను కొందఱిని గుర్తింపగలను; కాని, వారిని శిక్షించుటవలన నేమి ప్రయోజనము? నెటాలులోని తెల్లవారినిగూర్చి నేను భారతదేశమున దుష్ప్రచార మొనర్చితి నన్న వార్తలు విని వారు నామీఁద ఆగ్రహము పొందియుందురు. నిజమెఱిఁగినచో వారు తమ తప్పును తెలిసికొనలేక పోరు. నిజమునకు వారిని సక్రమమార్గమున నుంచకపోవుట నాయకులైన మీదియె తప్పు అనఁదగును. మీరును రాయిటర్ వార్తలునమ్మి, నేను ఉన్నవి లేనివి కల్పించి చెప్పితినని తలఁచితిరి. ఇట్టిస్థితిలో వారి నెవ్వరినిగూడ శిక్షించుట నాకు సమ్మతముకాదు,' అని నేను సమాధానమిచ్చితిని. నేను చెప్పిన మాటలను కాగితముపై వ్రాసియిమ్మని అతఁడడిగెను. దొమ్మిదారులను శిక్షింపవలదనిన నా మాటతో నా గౌరవ మినుమడించుననెను; తాను శాంతిభద్రతలు నెలకొల్పుటకు గొప్ప అవకాశము లభించుననెను. అతఁడు కోరినట్లు వ్రాసి యిచ్చి వచ్చితిని.

నేను ఓడదిగిననాఁడే 'నెటాల్ అడ్వర్టైజర్' పత్రికా ప్రతినిధి నన్ను కలిసికొనెను. అతఁడు నన్ను చాల ప్రశ్నలు వేసెను. వానికి సమాధానమిచ్చుచు తెల్లవారు నాపై మోపిన నేరములన్నియు అబద్ధములని ఋజువుచేసితిని. నెటాలులోని శ్వేతజాతులనుగూర్చి భారతదేశమున నేనుచెప్పిన విషయము లలో కల్పన సుంతయులేదని, అంతయు యదార్థమేయని, ఆ

విషయముల నన్నిటిని అంతకుముందు దక్షిణాఫ్రికాలో గూడ వెల్లడించియుంటినని చెప్పితిని. భారత దేశములోని నా యుప న్యాసములకన్నిటికి సర్ ఫెరోజిషా మెహతా ధర్మమాయని వ్రాతప్రతులుంచితిని. వాని నన్నిటిని ఆ పత్రికాప్రతినిధి కిచ్చి తిని. తెల్లవారనుకొనినట్లు రెండు యోడల నిండుగ భారతీయు లను నేను క్రొత్తగ నెటాలుకు దిగుమతి చేయలేదనియు, వచ్చినవారిలో చాలమంది దక్షిణాఫ్రికావాసులే యనియు, ఇంచుమించుగ అందఱు ట్రాన్సువాల్ రాష్ట్రమునకు పోయెడి వారే కాని నెటాలులో వసింపవచ్చినవారు కారనియు జెప్పితిని.

నేను పత్రికాప్రతినిధితో జరిపిన గోష్ఠియు, దుండగీం డ్రను శిక్షింపవలదని అధికారులకు చెప్పిన విషయమును మిక్కిలి యుపకరించినవి. డర్బాన్ ఐరోపియనులు తమ అక్రమ ప్రవర్తనకు సిగ్గుపొందిరి. పత్రికలును నావలన తప్పులేదనినవి; దుండగీండ్రచర్యను ఖండించినవి. ఇట్లు నన్ను తెల్లవారుచేసిన చిత్రహింస ఒకవిధముగ నా భవిష్యదుద్యమమున కుపకరించి నది; దక్షిణాఫ్రికాలో భారతీయుల గౌరవమునకు వన్నెదిద్ది నది; నా సత్యాగ్రహారంభమున కవసరమైన తొలి యనుభ వము గలిగించినది.

మూడు, నాలుగు రోజులలో ఇలుజేరి మామూలు ధోరణిలోబడితిని.

# 18

నాకు జీవితము సులభముగ, సుఖముగ జరుగుచున్నది. కాని, కొలదికాలములోనె ఖర్చులు తగ్గించుకొనవలెనను తలంపుకలిగినది. తలంపు కలిగిన తత్క్షణమె ఆచరణ ఆరంభమైనది. దీనితో పనియెక్కువయైనది. అయినను, క్రొత్తలో సరదాగనెయున్నది.

చాకలిఖర్చు విపరీతముగనున్నది. అయ్యో, అనుకొన్న వేళకు బట్టలు ఇంటికిరావు. రెండు, మూడు డజనుల చొక్కాలు, 'కాలర్లు' ఉన్నను ఎప్పటికప్పుడె యిబ్బందిగ నుండెడిది. ప్రతిదినము కాలరు మార్చుకొనవలెను. కనీసము రెండురోజుల కొకసారియైన చొక్కా మార్చవలెను. ఎంత ఖర్చయినను ఇబ్బంది తప్పలేదు. కాబట్టి, నేనే చాకిపనికి పూనుకొంటిని. బట్టలను ఇస్త్రీచేయు పరికరములనుకొన్నాను. ఇస్త్రీచేయు విధమును తెల్పు పుస్తకమును కొని చదివినాను. ఆ విధానమును నా భార్యకును వివరించినాను.

నేను మొట్టమొదటిసారి యిస్త్రీచేసిన కాలరు సంగతి యెన్నటికిని మఱపురాదు. కాలరుకు గంజి యెక్కువైనది. ఇస్త్రీపెట్టెను బాగుగ వేడిచేయలేదు. కాలరును సరిగరుద్దలేదు. ఏమైనది? కాలరు గంజి చొక్కానుగూడ ముఱికిచేసినది. దానిని ధరించి అస్లై కోర్టుకు వెళ్ళితిని. సాటి న్యాయవాదులు నా కాలరునుచూచి పకపకలాడిరి. ఇంతకును ఆనాంటికే పరుల ఎగతాళికి పట్టింపులేని స్థితికి వచ్చితిని.

"అయినను, కాలర్లను ఇస్త్రీచేసికొనుట నాకిదే మొదటి సారి ; గంజి యెక్కువైనట్లున్నది. ఏమైనను మీ యెకసక్కెములకింత అవకాశము గల్పించితిని. చాకలిఖర్చు మితిమించినది. వారిమీఁద ఎల్లపుడు ఆధారపడియుండుటేటికని నా బట్టలను నేనే యిస్త్రీచేసికొనుట ప్రారంభించితిని" అని వారితో నంటిని. ఏమన్నను, ఈ స్వయం సాహాయ్యసూత్రములోని సొగసు వారి మనసుకెక్కలేదు.

ఏమైనను, కొలఁదిరోజులలో నేను చాకిపనిలో దిట్టనైనాను.

# 19

డర్బానులోనున్నను, జోహాన్సుబర్గులోనున్నను, ఎప్పుడును మాది పెద్దకుటుంబమే. స్నేహితులు; గుమాస్తాలు మొదలైనవారు మాయింటనె ఉండెడివారు. వారిని మాకుటుంబసభ్యులుగనె పరిగణించెడివారము. అసలు, నాకు బంధువులు—అపరిచితులు, స్వదేశీయులు—పరదేశీయులు, తెల్లవారు-నల్లవారు అనుభేదమేలేదు. ఈ సమబుద్ధి నాలోనొక ప్రత్యేక సుగుణమనుటకు వీలులేదు. కేవలము స్వాభావికమైపోయినది.



జోహాన్సుబర్గులో న్యాయవాదిగా

నేను డర్బానులో న్యాయవాదిగ నున్నపుడు చాల

మంది గుమాస్తాలు మా యింటిలో నివసించుచుండెడివారు. వారిలో క్రైస్తవుఁడొకఁడుండెను. అతని తలిదండ్రులు 'అస్పృశ్యుల'నుపేర పిలువఁబడుచున్న కులమువారు. అతఁడు క్రొత్తగ మాయింటికి వచ్చినపుడు అతనికి పడక మొదలగునవి మేమే యేర్పాటు చేయవలసివచ్చినది. మాయింటికి వచ్చిన వారిని ఆదరించి ఆతిథ్యమిచ్చుటలో నాభార్య సాధారణముగ లోపముచేయదు. కాని, ఆమెకు 'అస్పృశ్యు'లనువారి యందుమాత్రము వెగటుపోలేదు. ఒకనాఁడామె ఆ గుమాస్తా



జొహెన్స్‌బర్గులోని న్యాయవాదులతో

గదిలోని కూజాపట్టుకొని మెట్లుదిగుచున్నది. ఆ పనిచేయుటలో ఏమాత్రము ఇష్టములేనట్లు ఆమెవైఖరి తెల్పుచున్నది. అది గమనించి నేను మిన్నకుండలేకపోయినాను. 'ఈ వెట్టివేషము నాయింటిలో కూడదుసుమా' అని గద్దించినాను. 'మీ యిల్లె నచో మీరేయుండవచ్చును; నాదారిన నన్ను పోనీయుడు' అని ఆమె బదులాడినది. ఇఁక నేమున్నది? నాకు 'శివమెత్తి'

నది. గబగబ ఆమెను చేయిపట్టుకొని తలుపుదగ్గఱకీడ్చి, వెలుపలకు త్రోసివేయవలెనని తలుపుదీసితిని. ఆమె కన్నీరుకాలువ కట్టినది. "చాలులెండి, మీ ప్రతాపము. సిగ్గైన లేకపోయె! నన్నెక్కడికి పొమ్మందురు? నేను గడియసేపైన తలదాచుకొనుటకిచట మఱెవ్వరును లేరే. ఏమి? భార్యనైనంతమాత్రమున మీ తన్నులకు, దౌష్టికమునకు తలయొగ్గవలసినదేనా? మీ బండాటము కట్టిపెట్టి తలుపుమూయండి. ఎవరైనచూచిన నవ్విపోదురు," అని ఆమె అన్నది.

ఆమాటలువిని పైకి గంభీరముగనున్నను, నా ప్రవర్తనకు నేనే లోలోపల సిగ్గుపడి కుమిలిపోయినాను. నాభార్య నన్ను విడువఁజాలని-చో నేనును ఆమెనువిడువలేను. మొత్తము మీఁద మా కిరువురకు నిట్టి పొరపొచ్చెము లపుడపుడు కల్గినను అవి వెనువెంటనె సమసిపోవుచుండెడివి. ఆమెలోని గొప్ప సహనమె నన్నువంచెడిది. ఏమైనను, అప్పటినుండి నాలో భర్తనను అహము తగ్గిపోయినది. మే మిరువురము నిష్కల్మషత్వమున నిగ్గుదేలిన మిత్రులమైతిమి. ఆమె నా కన్నివిధముల పరిచర్య చేసినది. స్వార్థరహితయై నాకు నిక్కమైన సహభాగిని, సహచారిణియైనది.

## 20

1897—1899 సంవత్సరముల మధ్యకాలపు విశేషములను విడచి, బోయరుయుద్ధము ప్రస్తావనకు వచ్చెదము.

తొలుత బోయరుయుద్ధము ప్రారంభమైనపుడు నేను బోయర్లనే అభిమానింపఁదలఁచితిని. కాని, కొంత ఆలోచించి మనసు మార్చుకొంటిని. ఈ విషయమునుగూర్చి అపుడు నా మనసులో గల్గిన తర్కవితర్కములను నా 'దక్షిణాఫ్రికా సత్యాగ్రహోద్యమచరిత్ర'లో వివరించితిని. నేను బ్రిటిష్ సామ్రాజ్యపౌరునిగ కొన్ని హక్కులు కోరుచున్నపుడు బ్రిటిష్ సామ్రాజ్యరక్షణమున పాల్గొనుట నా విధియని తుదకు తేలిన నిర్ణయము. హిందూదేశము బ్రిటిష్ సామ్రాజ్యభాగముగనె యుండి స్వాతంత్ర్యము పొందగలదనియు అప్పటి నా తలఁపు. మొత్తముమీఁద నా నిశ్చయమున కనుగుణముగ కొందఱు సహచరులను సమకూర్చి సేవాదళము నేర్పరచితిని. మా సేవాదళము పనిచేయుటకు మిక్కిలి కష్టముమీఁదగాని ప్రభుత్వము సమ్మతింపలేదు.

భారతీయులు పిఱికివారని, స్వార్థపరులని, సాహసవంతులుకారని, సామాన్యముగ ఆంగ్లేయులలో వాడుక. అందువలన నేను తలపెట్టిన సేవాదళ ప్రయత్నమున నాకు పెక్కురు నిరుత్సాహము గొల్పిరి. ఇండియన్ చర్చి మిషన్‌కు చెందిన డాక్టర్ బూత్ మాత్రము నాకన్నివిధముల ప్రోత్సాహము, సాహాయ్యమునిచ్చెను. మాదళమున కతఁడె శిక్షణమిచ్చెను.

మా సేవాదళమున 1100 మంది యుండిరి. 40 మంది నాయకులతో చక్కగ పనిచేసితిమి. అసలు మాపని యుద్ధభూమివెలుపలనే. మాకు 'ఎఱ్ఱశిలువ' రక్షణయునున్నది. అయినను, ఒక క్లిష్టసమయములో — స్పియన్ కాప్ దగ్గఱ

ఆంగ్లేయులకు పరాజయము కల్గినపుడు — బుల్లర్ సేనాని కోరి కపై మేము యుద్ధభూమిలో ప్రమాదకరమైన ప్రాంతమున కునుపోయి క్షతగాత్రులను మోచుకొనివచ్చితిమి. ఆ సమయములో దినమునకు సాధారణముగ 20, 25 మైళ్ళు నడచితిమి. గాయపడిన ఉడ్ గేట్ సేనాని మొదలగు ప్రముఖులనుగూడ మోచుకొనివచ్చిన గౌరవము మాకుదక్కినది.

మా సేవాదళము ఆఱువారములు పనిచేసినది. భారతీయులగౌరవ మినుమడించినది. వార్తాపత్రికలును మాసేవను బహువిధముల బ్రస్తుతించినవి.

ఒక్కొక్కప్పుడు—కఠినపరీక్షాసమయములలోగూడ — మానవస్వభావము ఎంతయో ఉదాత్తముగ నుండగలదని ఋజువుచేయఁగల్గిన యొకచిన్ని సంఘటనము నిచట తెల్ప మనసగుచున్నది. కొలెన్సో ప్రాంతమున గాయపడి మరణించిన లెఫ్టినెంట్ రాబర్ట్సు కళేబరమును మేము తీసికొనివచ్చుచున్న సందర్భమది. మాతో కొందఱు సైనికులునున్నారు. అందఱము అలసి మిక్కిలి దప్పిగొనియున్నాము. దారిలో చిన్న నీటికయ్య కన్పించినది. ఎవరుముందు త్రాగుట? 'ముందు మీరు కానిం' డని సైనికులతో చెప్పితిమి. 'మీరు త్రాగినతరువాతనే మా వంతు,' అని వారనిరి. ఇట్లు కొంతసేపు 'మీరుముందు, మీరు ముందు,' అనుచు ఉదాత్తమైన చక్కని పోటీజరిగినది.

మా బోయరుయుద్ధానుభవములను ముగించుముందు, ఇంకొకవిషయము చెప్పఁదగినదికలదు. బోయర్లు లేడీస్మిత్ పట్టణమును ముట్టడించినపు డచట ఇంగ్లీషువారితోఁబాటు భారతీయులును కొందఱు నివసించుచుండిరి. భారతీయులలో

కొందఱువర్తకులు; మఱికొందఱు రైల్వేలో పనిచేయు కూలీలు; ఇంక కొందఱు ఆంగ్లేయులకడ నౌకరులు. లేడీ స్మిత్ రక్షణకు బాధ్యతవహించిన ఆంగ్లసేనాని అచటిప్రజల కందఱకు ప్రత్యేకవిధులు నియమించెను. అచటి భారతీయులలో ప్రభుసింగ్ అనునతనికి నియమింపఁబడినపని మిక్కిలి కష్టమైనది; ప్రమాదకరమయినది. ప్రభుసింగు సామాన్యపు కూలీ. బోయర్లు దూరమున ఒకకొండపై ఫిరంగులనమర్చుకొని పట్టణమును ధ్వంసముచేయుచున్నారు. కొండదగ్గఱనుండి ఫిరంగిగుండ్లు పట్టణములోపడుటకు ఒకటి, రెండు నిముసములైన పట్టును. ఫిరంగికాల్పు క్షణమైన ముందుగ తెలిసినచో ప్రజలు ఎక్కైన వానిబారినుండి తప్పుకొనుటకు వీలగును. ప్రభుసింగు ఒకచెట్టుకొమ్మలలో కూర్చుండి ఫిరంగులను గమనించుచు, ఫిరంగికాల్పు కనఁబడగనె ఒక గంటకొట్టెడివాఁడు. తత్క్షణమె ఆశ్రయములలోనికి పరుగెత్తి ప్రజలు ప్రాణరక్షణ జేసికొనుటకు వీలైనది.

ప్రభుసింగు ధైర్యసాహసములు నాఁటి భారతరాజప్రతినిధియగు కర్జన్ ప్రభువు చెవులఁబడినవి. కర్జన్ ప్రభువు కాశ్మీరు శాలువనొకటి పంపి ప్రభుసింగును బహూకరించెను.

## 21

యుద్ధసందర్భమున పనిచేసి తిరిగివచ్చిన తరువాత దక్షిణాఫ్రికాలోకంటె నేను నిర్వహింపఁదగినపని భారతదేశమున నె యెక్కువయున్నదని యూహించితిని. స్వదేశమున కరుగుట

కనుమతినిండని సహచరుల నడిగితిని. ఒక ఏఁడాదిలో మరల అవసరమగుచో నేను తప్పక దక్షిణాఫ్రికాకు వత్తునని నాచే వాగ్దానము గావించుకొని వారు నా ప్రయాణమున కనుమతి నిచ్చిరి. నాకు గొప్ప వీడ్కోలుసభ నేర్పరచిరి. వెండి — బంగారు వస్తువులు, వజ్రములు మొదలగువానిని పెక్కింటిని నాకు బహుమతులుగనిచ్చిరి. వాని నేమిచేయుటయా అని ఒక రాత్రియంతయు ఆలోచించి, స్వజాతీయుల పురోభివృద్ధికి నిధిగ నుంచుడని తిరిగి యిచ్చివేసితిని. నేను చేసినపని అప్పటిలో నా భార్యకు నచ్చలేదు. కాని, కాలక్రమమున ఆమెకు సమాధానము కుదిరినది. ప్రజాసేవకుఁడు బహుమతులు స్వీకరింపరాదనుభావము నాలో కుదురుకొన్నది.

నేను స్వదేశమునకు వచ్చిన సంవత్సరము కలకత్తాలో జరిగిన భారతజాతీయమహాసభ ప్రజాసేవయొనర్చుటకు నాకు గొప్ప అవకాశమిచ్చినది. వీధులు, పాయిఖానాలు ఊడ్చుటలో స్వచ్ఛందసేవకులకు స్వయముగ పాఠములిచ్చితిని. కాంగ్రెస్ కార్యదర్శి ఘోషాల్ కడ గుమాస్తాగపనిచేయు అవకాశము నాకబ్బినది. గోఖ్లే ధర్మమాయని దక్షిణాఫ్రికా భారతీయుల స్థితినిగూర్చి మహాసభలో ఒకతీర్మానమును ప్రవేశపెట్టగల్గినాను. నేను స్వదేశమునకు వచ్చిననాఁటినుండి గోఖ్లే నాయెడ సోదరవాత్సల్యము జూపసాగెను. నేను బొంబాయిలో న్యాయవాదవృత్తి జరుపుకొనుచు, ఆయనకు కాంగ్రెసు కార్యకలాపములలో తోడ్పడుచుండవలెనని ఆయన అభిమతము. ఆయన సలహా నచ్చినను, అచట న్యాయవాదవృత్తి ప్రోత్సాహకరముగ నుండదేమోయని జంకితిని. రాజకోటలో కొంత

కాలము న్యాయవాదిగనుంటిని. నేను తొలుత ఇంగ్లాండుకు వెళ్ళుటకు ముఖ్యకారకుడైన కేవల్ రామ్‌దవె సలహాపై తిరిగి బొంబాయికి మారితిని. అచట రాబడి నేననుకొన్నదానికంటె మిన్నగ నుండజొచ్చినది. ఇట్లు వృత్తిలో స్థిరపడితిననుకొనుచుండ, వెంటనె దక్షిణాఫ్రికాకు రమ్మని నా సహచరులనుండి పిలుపువచ్చినది. ఉన్నదికదా వెనుకటివాగ్దానము? దక్షిణాఫ్రికాకు తరలితిని.

నేను వెళ్ళునప్పటికి దక్షిణాఫ్రికా రాజకీయవాతావరణ మెట్లుండెనో యిపుడు వివరింపబనిలేదు. యుద్ధమును, యుద్ధకాలమున భారతీయులొనర్చిన సేవను ప్రభుత్వము మఱచిపోయినది. భారతీయులస్థితి నానాటికి క్లిష్టముకాజొచ్చినది. వారికి చిక్కులపై చిక్కుల గల్పింపసాగిరి. వారికి తోడ్పడదలచినచో నేను దక్షిణాఫ్రికాలో చాలకాలము నివసించవలసినట్లు తోచినది. ఎంతయో శ్రమపడినమీదటగాని జొహాన్స్‌బర్గులో న్యాయవాదులుండు ప్రాంతములో నాకు గదులుదొరకలేదు.

స్వజాతీయులసేవలో పూర్తిగ మగ్నము కాదలచిన నేను తిరిగి గీతాపారాయణ మొనర్చితిని. దానితో ఆత్మజిజ్ఞాస అధికమైనది.

వెనుకటివలెనె ఈ పర్యాయముగూడ దివ్యజ్ఞాన సామాజికులగు మిత్రులతో గలిసి భగవద్గీతా పారాయణ మొనర్చితిని. గీతాపారాయణమున నాకు శ్రద్ధ యినుమడించినది. గీతాశ్లోకములను దాదాపు పదుమూడు అధ్యాయముల వఱకు కంఠస్థ మొనర్చితిని. గీత నాకు మార్గదర్శినియైనది.

సంశయసమయములలో నా కదియే పరమనిఘంటువు. ముఖ్యముగ గీతలోని 'అపరిగ్రహ', 'సమభావా'ది పదములు అనర్ఘరత్నములవలెఁ బ్రకాశించుచు నా హృదయవీధిలో పదిలపడినవి. సర్వస్వమును పరిత్యజింపవలెనని, నిరుపమానమైన సమభావమును నెఱపవలెనని యెంచితిని. భగవంతుని అనుసరించుట కదియేమార్గమని గ్రహించితిని. వీనిని సాధించుటెట్లు, అన్నదియే ప్రశ్న. ఆలోచించితిని. వీనికిముందు హృదయమున—దృక్పథమున పరివర్తనమవసరమని యూహించితిని. వెంటనె, నా 'ఇన్‌స్యూరెన్స్‌పట్టా'కు కాలదోషము పట్టనిండని బొంబాయిలోని నా మిత్రులకు జాబువ్రాసినాను. ''ఇఁకముందు నా ఆర్జనలో నేమైన నిలువజేసిపంపుమననుకొనకుము; ఏమైన మిగిలినను, దానినంతయు స్వజాతీయులసేవకే వినియోగింతును,'' అని నాసోదరునకు వ్రాసినాను.

ఈ రోజులలోనె—1904 వ సంవత్సరమున — దక్షిణాఫ్రికా భారతీయుల సమస్యలను చర్చించు 'ఇండియన్ ఒపినియన్' అను పత్రికకు సంపాదకుఁడనైతిని. నా సంపాదనలో కుటుంబపు ఖర్చులుపోను మిగిలినదంతయు వెచ్చించి పత్రికను నడపితిని. ఇప్పటి 'యంగ్ ఇండియా', 'నవజీవన్' పత్రికలవలె అప్పటిలో 'ఇండియన్ ఒపినియన్' నా జీవితమునకు అద్దమువంటిది. అందలి నా రచనలలో 'కాసంత' కల్పనకాని, 'ఆవగింజంత' అతిశయోక్తికాని లేవు. ఆత్మనిగ్రహసాధన కది చక్కని అవకాశమునిచ్చినది.

నేను ఆహారవిషయమునుగూర్చి కొన్నివ్యాసములు వ్రాసి 'ఇండియన్ ఒపినియన్' పత్రికలో ప్రకటించితిని. పిదప

నవి గ్రంథరూపముననుు వెలువడినవి. వాని ఆంగ్లానువాదము–'గైడ్ టు హెల్త్' — ప్రాక్ప్రతీచీఖండములలో ప్రచారమొందినది.

# 22

ఇండియన్ ఒపినియన్‌కు సంబంధించిన కొన్ని వ్యవహారములను చక్కఁబెట్టుటకు 1904 వ సంవత్సరములో నేను డర్బానుకు వెళ్ళవలసివచ్చినది. ముద్రణ వ్యవహారములను బాగుగ తెలిసిన నా ఆంగ్లమిత్రుఁడు ఆల్బర్టు వెస్ట్ నేను కోరినదే తడవుగ తనవ్యాపారమును కట్టిపెట్టివచ్చి 'ఇండియన్ ఒపినియన్' పత్రిక పరిస్థితులను చక్కఁబెట్టుప్రయత్నమున నాకు చాల తోడ్పడెను.

డర్బానుకు ప్రయాణమై రైలుస్టేషనుకు వెళ్ళినాను. నామిత్రుఁడు పోలక్, "దారిలో చదువుకొనవచ్చును, నీకు బాగుగ నచ్చును," అని చెప్పుచు నాకు రస్కిన్ మహాశయుఁడు రచించిన 'అన్ టు దిస్ లాస్ట్' అను గ్రంథమునిచ్చెను.

నేను చదివినపుస్తకములలో కొన్ని నాలో కొంత మార్పుదెచ్చినవి. 'అన్ టు దిస్ లాస్ట్' వానిలో తలమానికము వంటిది; నాలో ప్రచండమైన పరివర్తన గల్గించినది. చదువ మొదలిడి, పూర్తిచేయువఱకు దానిని విడువలేకపోతిని. ఆ గ్రంథము నన్ను పూర్తిగ కైవసముజేసికొన్నది. నేను రస్కిన్ రచనల నంతకుమున్నెన్నఁడును చదివియెఱుఁగను.

'అన్‌టు దిస్ లాస్ట్' అప్రయత్నముగ నాజీవితములో గొప్ప మార్పుదెచ్చినది. అందలి యుద్బోధనలు నాకు గాఢ విశ్వాసమున్న కొన్నిసిద్ధాంతములతో సరిపోలియున్నవి. వీనిని ఆచరణలో పెట్టవలెనను సంకల్పముకల్గినది. ఇవి ముఖ్యముగ మూఁడు సిద్ధాంతములు:

సంఘపు సమిష్టిక్షేమముననే వ్యక్తిక్షేమ మిమిడి యున్నది.

కష్టించి జీవనోపాధి సంపాదించుకొనుహక్కు అందఱకు సమానమే. కాఁబట్టి, న్యాయవాదివృత్తికెంత ప్రాధాన్యమున్నదో మంగలివానివృత్తికిని అంత ప్రాధాన్యమున్నది.

పొలముదున్ను కర్షకుల - చేతిపనులుచేయు పారిశ్రామికుల - జీవితములే యోగ్యమైనవి - అని.

వీనిలో మొదటిది నాకవగతమే. రెండవది కొంచెము అనుభవమునకు వచ్చినది. మూఁడవది మున్నెన్నఁడును తోఁచలేదు. రెండవ-మూఁడవ సిద్ధాంతములు మొదటి సిద్ధాంతమునం దిమిడియున్నవే అని 'అన్‌టు దిస్ లాస్ట్' స్పష్టముగ ప్రబోధించినది. ఈ సిద్ధాంతములను ఆచరణలోపెట్టు నా నవ జీవనమునకు 'అన్‌టు దిస్ లాస్ట్' ప్రబోధము ప్రభాతమైనది.

## 23

'అన్‌టు దిస్ లాస్ట్' ప్రబోధముననుసరించి నా జీవిత విధానమును మార్చుకొనవలెనని కల్గిన సంకల్పము కార్యరూపముబట్టినది. 'ఇండియన్ ఒపీనియన్' ప్రచురణ, వ్యవసాయ

మును ఒక వ్యవసాయ కేంద్రముననే నడుపదలంచితిమి. అచట నందఱకు పనిపాటులుండును. తీఱుబడి వేళ అచ్చుపని చూడవలెను; అందఱకు సమానమైన భృతియే – నెలకు మూఁడుపౌనులు. ఈ నా ప్రతిపాదన వెస్టుకును నచ్చినది.

డర్బాన్ స్టేషనుకు సమీపమున 100 ఎకరముల భూమిని కొంటిమి. అందు కొన్ని నారింజ, మామిడి మొదలగు పండ్ల చెట్లున్నవి. ఒక నీటిబుగ్గయు కలదు. ముద్రాశాల కొకపాక వేసితిమి. వెస్ట్ మొదలగువారును ఇబ్బందియని తలఁపక వడ్రంగులు, తాపీపనివాండ్రు మొదలగువారితో గలిసి నివసించిరి. అంతదనుక గడ్డిగాదములతో – పాములు జెఱ్ఱులతో నిండి, నివాసయోగ్యముగాకుండిన ఆ ప్రదేశమునంతటిని మేము బాగుపఱచితిమి. ఫినిక్స్ ఆశ్రమమని పేరుపెట్టితిమి. ఒక వారములోపుననె మా సామానులనన్నిటిని ఫినిక్స్‌కు చేర్చుకొంటిమి.

భారతదేశమునుండి నాతో వచ్చిన స్నేహితులు మొదలైనవారిని ఫినిక్స్ ఆశ్రమములో నివసింపుమంటిని. కొందఱు సమ్మతించినారు. వారిలో మగన్‌లాల్ గాంధి చెప్పఁదగినవాఁడు.

మునిఁగినను, తేలినను నాతోడిదే 'స్వర్గ' మని తన వ్యాపారమును వదలివచ్చినవాఁడు మగన్‌లాల్. శక్తి సామర్థ్యములను, స్వార్థత్యాగమును బ్రకటించిన నా సహచరులలో నతఁడు మేలుబంతి. కష్టపడి, స్వయముగ నేర్చుకొని చేతిపనులలో దిట్టయైనాఁడు. దక్షిణాఫ్రికా సత్యాగ్రహానంతరము భారతదేశమునకు తిరిగి వెళ్ళిన నా అనుచరుల కతఁడె నాయ

కుఁడు. వారే సత్యాగ్రహాశ్రమమున మొదటిసభ్యులు. నా యుద్దేశ్యములను, సిద్ధాంతములను అకుంఠితదీక్షతో ఆచరణలో పెట్టుటయందతఁడు తనసర్వస్వము నర్పించెను. 1928 వ సంవత్సరమున తన భౌతికదేహమును విడచువఱకతఁడు సత్యాగ్రహాశ్రమమునకు జీవగఱ్ఱయై నిలచెను.

ఫినిక్సు ఆశ్రమమట్లు 1904 వ సంవత్సరమున స్థాపింపఁబడినది. ఇక్కట్టులెన్ని కల్గినను మానక 'ఇండియన్ ఒపీనియన్' అచటినుండియే ప్రచురింపఁబడుచుండెడిది. తొలుత క్రొత్తయైనను, ముద్రాశాల పనులనన్నింటిని తెలిసికొని మగన్‌లాల్ దక్షతతో పనిచేసెను.

ఫినిక్సు ఆశ్రమమును ప్రారంభించిన కొద్దికాలమునకే నేను జొహన్సుబర్గుకు వెళ్ళవలసివచ్చినది. అచట పోలక్ కన్పించెను. వెనుక తాను నాకిచ్చిన రస్కిన్ రచన ఫినిక్సు ఆశ్రమస్థాపనకు కారణమయ్యెనని విని అతఁడమితానందమొందెను. 'క్రిటిక్' పత్రికాకార్యాలయమున తనయుద్యోగమును మానుకొని అతఁడు మాతో వచ్చిచేరెను.

జొహన్సుబర్గు ఆఫీసులో పనియెక్కువైనది. నాకు తోడ్పడుటకు పోలక్‌నుగూడ అచటనె యుండుమంటిని. కాలక్రమమున అతఁడు 'అటర్నీ' యగుట మంచిదనియు సూచించితిని. ఎప్పటికైనను ఇరువురము ఫినిక్సు ఆశ్రమములో స్థిరనివాస మేర్పరచుకొనవలెనని అప్పటి నా ఆశయము. కాని, అది నెఱవేఱలేదు.

రస్కిన్ గ్రంథములోని ప్రబోధము ననుసరించి నిరాడంబర జీవితవిధానమున నింకొక మెట్టెక్కితిని. ఇంటిలోని పని

నంతటిని స్వయముగ చేసికొనసాగితిమి. రొట్టెలను కొనుట మాని వేసి సొంతముగ తయారుచేసికొనఁజొచ్చితిమి. పిండి విసరుటకొక చిన్న మరగొంటిని. దానిని త్రిప్పుటలో పిల్లలు, పోలక్ కూడ సాయపడెడివారు. మరత్రిప్పుట పిల్లలకు సరదాగ నుండెడిది. వారికదియొక కసరత్తు. నౌకరులున్నను, పాకీ పనియు సొంతముగ చేసికొనెడివారము.

ఇట్లు నేను, నా కొడుకులు స్వయంసాహాయ్యసూత్రము ననుష్ఠించుచుండ జొహెన్స్‌బర్గునుండి మా కాపురమును ఎత్తివేయవలసిన అవసరమేర్పడినది. జూలూ 'తిరుగబాటు' వార్తవిని, నా భార్యాపుత్రులను ఫినిక్స్‌కు పంపివేసితిని. పోలక్ కూడ ఫినిక్స్ చేరెను.

## 24

బోయరుయుద్ధమునందువలె జూలూ 'తిరుగబాటు' నందును నేను బ్రిటనుకు సాయపడుటకు నా ప్రభుభక్తియే కారణము. జూలూలయందు నాకెట్టి ద్వేషమును లేదు. వారు భారతీయుల నెన్నఁడు బాధించి యెఱుఁగరు. నిజమునకది తిరుగబాటుకాదు. ఆ సంఘటనకు ప్రభుత్వమె ఆ పేరు పెట్టినది.

నెటాలుపౌరునిహోదాలో సామ్రాజ్యరక్షణకు పూనుకొందునని, భారతసేవాదళమును నిర్మించి జూలూతిరుగబాటు సమయమున సేవచేయుదునని గవర్నరుకు జాబువ్రాసితిని. అతఁడు సంతోషముతో నంగీకరించెను. నేను వెంటనె డర్బా

నుకుపోయి సహచరులను ప్రోగుజేసితిని. మొత్తము 24 మందిమి. నాకు తాత్కాలికముగ 'సార్జంట్ మేజర్' అను హోదానిచ్చిరి. మాదళము దాదాపు ఆఱువారములు పని చేసినది.

'తిరుగబాటు' జరుగుచున్న ప్రాంతమునకు వెళ్ళితిమి. పరిస్థితులను గమనించితిమి. వాస్తవమునకది తిరుగబాటు కాదు; పన్నుల నిరాకరణోద్యమము. నాకు జూలూలయందె అభిమానముకల్గినది. గాయపడిన జూలూలకు పరిచర్య చేయుటయె ముఖ్యముగ నచట మాపనియని తెలిసికొని కొంత తృప్తిపడితిని. వారికి పరిచర్య చేయుటకు తెల్లవారెవ్వరును సమ్మతింపరైరి. అందువలన మారాక కచటి వైద్యాధికారి సంతోషించెను. మేముచేసిన పరిచర్యకు జూలూలు తమ సంతోషమును, కృతజ్ఞతను ప్రకటించిరి. మా కప్పగింపబడిన జూలూలు గాయపడినది యుద్ధములోకాదు. అసలు యుద్ధముండినగదా? కొంతమంది జూలూలను అనుమానముపై




1906 "జూలూ తిరుగబాటు"లో ఇండియన్ ఆంబులెన్స్ దళానికి నాయకుడుగా.

ఖైదీలుగ పట్టుకొనివచ్చి ఆంగ్లేయులు వారిని కాయములు గాయములగునట్లు కొరడాలతో కొట్టి శిక్షించిన కాండమది! క్షతగాత్రులలో జూలూాల సానుభూతిపరులును కొందఱు న్నారు. ప్రమాదముకల్గిన ప్రదేశములకన్నిఁటికి మేము వెళ్ళి తిమి. ఎచటికేగినను మా దళమునకు మానవసేవచేయఁగల్గిన అవకాశమబ్బినదికదాయని సంతోషించితిమి.

'తిరుగబాటు' ప్రదేశములను చూచినపుడు నాకది ఆంగ్లేయులు అనుమానమున్న జూలూాలను వెంటాడి పట్టి, బంధించి, బాధించుచున్న ఘట్ట మనిపించినది. ఇట్లనుటలో కొందఱు ఆంగ్లేయులును నాతో ఏకీభవించిరి. అమాయికపు ప్రజలున్న వాడలపై ఆంగ్లేయుల తుపాకులు టపాకులవలె ప్రేలుచున్నవార్తలు నిత్యము వినవచ్చెడివి. అట్టిస్థితిలో ప్రభుత్వపు అసత్యప్రచారమును దిగమ్రింగి, యోపినంతవఱకు జూలూాలకు సేవగావించితిమి. మా సేవాదళము పనిగొనకున్నచో పాపము, గాయపడిన జూలూాలకు దిక్కులేని చావయ్యెడిదియే.

# 25

సేవాదళమునునడపుచు జూలూాలాండ్ కొండలలో, గుట్టలలో, వంకలలో, డొంకలలో తిరుగుచున్నపుడు నాలో తీవ్రమైన ఆలోచనలుకల్గినవి. నేను బ్రహ్మచర్యవ్రతమూనుట అవసరమనిపించినది. మానవసేవకు జీవితము నంకితమొనర్ప నెంచినవానికది ఆవశ్యకమను విశ్వాసమేర్పడినది. బ్రహ్మ

చర్యమునుగూర్చి నా సహచరులతోఁగూడ కొంతచర్చించి తిని. మానవసేవచేయు సదవకాశములు తఱచుగ కలుగవలె నని కోరుకొను నేను, సంసారసౌఖ్యముల నభిలషించుచో నిరాటంకముగ నా ధర్మమును నెఱవేర్చుకొనఁజాల ననుకొం టిని. నా మానవసేవాభిరతి నాకు బ్రహ్మచర్యవ్రతము తప్ప దనిపించినది.

నేనిట్లు శారీరక – మానసికశ్రమలో మునిఁగియున్న కాలమున ప్రభుత్వము జూలూల నణఁచుట పూర్తియైనదను వార్తలువచ్చినవి. పిదప ఒకటి, రెండు రోజులలో మా సేవా దళము పనినుండి విడుదలయైనది. మాసేవ నభినందించుచు గవర్నరునుండి జాబుగూడ వచ్చినది.

ఫినిక్సు ఆశ్రమమునకు తిరిగివచ్చి, సహచరులతో సంప్రదించి, నా 'భీష్మప్రతిజ్ఞ'– శాశ్వతబ్రహ్మచర్యవ్రతనిష్ఠ – పూనితిని. వ్రతదీక్ష నెఱపుట ఎంతకష్టమో నేనపుడు పూర్తిగ ఆలోచించనిమాట నిజమే. అయినను, నిర్మలబుద్ధితో పూనిన వ్రతము కొనసాగకతప్పదను ధైర్యము మాత్రమున్నది.

ఆ జన్మాంతము వ్రతనిష్ఠయేలనన్న సూచనలు కొన్ని వచ్చినవి. కాని, వానిని పెడచెవిఁబెట్టితిని. స్థిరమైన వ్రతదీక్ష వ్యామోహములనెడు శత్రువులదాడికి పెట్టనికోటవంటిది. మానసికదౌర్బల్యమునకు, సంశయములకు నది వజ్రాయు ధము. విరక్తిలేని పరిత్యాగము నిలువఁజాలదు—అనిన కవి సూక్తి అమోఘమైనది.

1906 వ సంవత్సరమున నేను శాశ్వతబ్రహ్మచర్యవ్రత మూనితిని. ఆ విషయమును ముందుగ నాభార్యతో చెప్ప

లేదు. అయినను, ఆమె యెట్టి అభ్యంతరము జెప్పక, నాకానందమునించి, తనకు స్థిరయశస్సు సంతరించుకొన్నది.

1906వ సంవత్సరమున 'భీష్మప్రతిజ్ఞ' నూనినప్పటి నుండి నాకు మున్నెన్నఁడెఱుఁగని స్వేచ్ఛ, సంతోషము సంఘటిల్లినవి. పిమ్మట నొకమాసమునకె సత్యాగ్రహమునకు పునాదివైచుట జరిగినది. నా వ్రతమిందుకు బాగుగ ఉపయోగించినది. సత్యాగ్రహము అనాలోచితముగనె ఆవిర్భవించినది. కాని, నా వెనుకటి చర్యలన్నియు దాని కనుకూలముగ పరిణమించినవి.

బ్రహ్మచర్యవ్రతము సంతోషజనకమైనదంటిని. కాని, దానిని నిలువఁబెట్టుకొనుట సులభమని తలఁపరాదు. అనుక్షణమప్రమత్తతతో జరింపవలసివచ్చినది. బ్రహ్మచర్యమనిన కత్తివాదరసాము.

త్రికరణశుద్ధిగ జరుగు సర్వేంద్రియ నిగ్రహమె బ్రహ్మచర్యము. యథేచ్ఛావిహారి జీవితమునకు, బ్రహ్మచారి జీవితమునకుఁగల వ్యత్యాసము గమనింపఁదగినది. స్వేచ్ఛావిహారి విలాసములను గమనించును; బ్రహ్మచారి భగవంతుని చిద్విలాసమును గమనించును. అతఁడు శుష్కప్రసంగములు వినును; ఇతఁడు భగవత్సంకీర్తనములు వినును. కాలము నతఁడు వృథాసల్లాపములలో, సరదాలలో గడపును; ఇతఁడు ధ్యానములో, ప్రార్థనములలో గడపును. ఇద్దఱును అంతరాత్మకు నిత్యనైవేద్యము చెల్లింతురు; కాని, అతనిసేఁత జిహ్వాచాపల్యము తీరుటకు; ఇతనిసేఁత పవిత్రమైన దేహరక్షణమునకు.

నిర్విరామము, నిరంతరాయమునగు సాధనవలనఁగాని బ్రహ్మచర్యదీక్ష కొనసాగదు. ఏమైనను, స్వశక్తిలో విశ్వాసమున్నంతగ భగవంతునిలోఁగూడ విశ్వాసమున్నచో బ్రహ్మచర్యవ్రతానుష్ఠానము మూలమున భగవంతుని సాధించు యత్నము నిస్సంశయముగ నెఱవేఱును.

"నిరాహారునకు విషయములయందభిలాష వదలినను, తద్రసాసక్తి వదలదు. ఎవనిబుద్ధి పరమాత్మయందు లగ్నమగుచుండునో అట్టివానికి ఎట్టిప్రీతియు నుండదు,"–అని భగవద్గీత ప్రవచించుచున్నది. కావుననే, మోక్షము నర్థించువానికి భగవన్నామము, భగవత్కృప కడపటశరణ్యములు. భారతదేశమునకు తిరిగివెళ్ళిన పిదపగాని నాకీసత్యము గోచరించలేదు.

## 26

దక్షిణాఫ్రికాలో నా న్యాయవాదవృత్తియందు గల్గిన అనుభవముల నొకటి, రెండు చెప్పెదను. అబద్ధములాడుటె న్యాయవాదిపనియని 'చిన్నప్పుడు' విన్నాను. కాని, ఆమాట నాయెడ వర్తింపలేదు. అబద్ధముఁలాడి అధికారముగాని, డబ్బుగాని సంపాదింపవలెనని నే నెన్నఁడనుకొనలేదు. నాకు జ్ఞాపకముండినంతవఱకు నావృత్తిలోఁగూడ నేను అసత్యముపొంతకు పోలేదు. నేను న్యాయవాదిగ చక్కఁబెట్టిన వ్యవహారములలోఁగూడ చాలభాగము ప్రజాసేవ కనుబంధమే. అట్టివానిలోఁ గొన్నింటికి ఖర్చులును నేనే యెదురుపెట్టితిని. వ్యాజ్యెము గెలిచిననే నాకు 'ఫీజు' నిచ్చుట—అను ఏర్పా

లెఱుఁగను. అబద్ధపు వ్యాజ్యెములను పట్టుట, తప్పుడుసాక్షు లను పెట్టుట నాపనికాదని కక్షిదారులకు ముందుగనె తెల్పెడి వాఁడను. అక్రమములైన వ్యాజ్యెములను నాకడకు తీసికొని వచ్చుటవలన ప్రయోజనములేదను ప్రతీతికల్గినది.

ఒకసారి జొహెన్స్‌బర్గు మేజస్ట్రేటుకోర్టులో విచారణ జరుగుచుండగ నా కక్షిదారుఁడు నన్ను మోసగించెనని గ్రహించితిని. వెంటనే, మా 'కేసు'ను కొట్టివేయుమని మేజ స్ట్రేటుతో చెప్పితిని. ఎదిరిపక్షపు న్యాయవాది ఆశ్చర్యము నొందెను. మేజస్ట్రేటుమాత్రము సంతోషించెను. ఆ సంఘ టనవలన నావృత్తి కేమియు దెబ్బతగులలేదు. 'పైగ' నాసత్య నిష్ఠ సాటిన్యాయవాదులలో నాకు గౌరవముపెంచినది; వారి జాతివాఁడను కానను 'లోటు'న్నను, కొన్నియెడల వారి ప్రేమాదరముల నార్జించిపెట్టినది.

పార్సీరుస్తుంజీ ఒకపర్యాయము గట్టిచిక్కులోఁబడెను. అతఁడు పెద్దవర్తకుఁడు. నాకు సహచరుఁడు; దక్షిణాఫ్రికా భారతీయులకు మిక్కిలిప్రేమపాత్రుఁడు. బొంబాయి, కల కత్తాలనుండి అతఁడు సరకులను పెద్దపెట్టున దిగుమతిచేసి విక్ర యించుచుండెడివాఁడు. ప్రభుత్వపుసుంకములు చెల్లించకుండ కొన్నిసరకులను దిగుమతిచేసి అధికారులకు పట్టువడెను. కన్నీరుగార్చుచు అతఁడు నాకడకు పరుగెత్తుకొనివచ్చెను. నేరమునుండి తప్పించుకొనుటకు మార్గము? "తప్పును ఒప్పు కొనుట ఒక్కటేమార్గము," అంటిని. "నీ యెదుట ఒప్పుకొను చుంటినికదా, చాలదా?" అని అతఁడనెను. "మోసగించినది ప్రభుత్వమును; కావున, వారియొద్దనే నిజముచెప్పి, వారు

విధించు అపరాధమును చెల్లింపుము,” అని చెప్పిపంపితిని.

రుస్తుంజీ తన న్యాయవాదినిగూడ ఆలోచించెను. కాని, అతఁడు నా సలహాతో ఏకీభవింపలేదు. అయినను, రుస్తుంజీ నాసలహాయె పాటింపఁదలఁచెను. ‘ప్రాసిక్యూషను’కు ఉత్తరువులీయవలసిన కస్టమ్సు అధికారితోడను, ‘అటర్నీ జనరల్’తోడను నేను మాట్లాడెదననియు, జరిమానాను విధించుటతో వారు తృప్తినొందని చో, తాను చెఱ కేగక తప్పదనియు నేను రుస్తుంజీకి చెప్పితిని. తప్పుచేయుట సిగ్గుపాటు, కాని, దానిఫలితముగ చెఱసాలకేగుట సిగ్గుపాటు కాదనియు చెప్పితిని.

రుస్తుంజీ కొంచెమటునిటు ఆలోచించెను. తుదకు నేను చెప్పినట్లుచేయుట కిష్టపడెను. నేను అధికారులను కలిసికొని నిజమంతయు చెప్పివేసితిని. వారు నా నిష్కాపట్యము నభినందించిరి. తాను దాఁటవేసిన సరకులకిమ్మడి రెట్టింపు జరిమానాకట్టి రుస్తుంజీ బయటపడెను.

రుస్తుంజీ ఆ సంఘటనమునంతయు పూసగ్రుచ్చినట్లు పెద్దకాగితముపై వ్రాయించి, చట్రముగట్టించి, తనవారసులకు – తరతరములవారికి—సాటివర్తకులకును తగిన హెచ్చరికగ నుండునట్లు తన కార్యాలయమున గోడకు వ్రేలఁగట్టించెను.

# 27

జూలూలాండ్ రంగమునుండి తిరిగివచ్చిన తరువాత

ఫినిక్స్‌లో సహచరులతో నా జీవితాదర్శములను, భావికార్య క్రమమునుగురించి సంప్రదింపసాగితిని. అంతలో - 1906 వ సంవత్సరము ఆగస్టు నెలలో - ట్రాన్స్‌వాల్ ప్రభుత్వము భారతీయుల నివాసవిషయమున చేసిన క్రొత్త 'ఆర్డినెన్సు' ముసాయిదా ప్రకటింపఁబడెనని తెలిసినది.

ప్రభుత్వపు అత్యవసర శాసన స్వరూపమును చూచితిమి. అది భారతీయుల గౌరవాభ్యుదయములకు తోఁకచుక్క. ట్రాన్స్‌వాల్‌లో నివాసపుహక్కుగల్గి, ఎనిమిదేండ్లకుమించిన వయసుగల్గిన భారతీయులందఱు - స్త్రీలు, పురుషులు - మరల ఆసియాజాతుల రిజిస్ట్రారుకు దరఖాస్తులు పంపుకొని, పూర్వము పొందిన అనుమతిపత్రముల నిచ్చివేసి, తమ నివాసమునకు క్రొత్తగ అనుమతి పొందవలెనని అందలి ముఖ్యాంశము. దరఖాస్తులో పేరు, నివాసస్థలము, వయసు, కులము మొదలగు వివరములుండవలెను. రిజిస్ట్రారు దరఖాస్తుదారుల శరీరముపై నున్న మచ్చలు మొదలగు గుర్తులను వ్రాసికొని, వ్రేళ్ళ ముద్రలు తీసికొనును. నిర్ణయింపఁబడిన తేదీలోపుగ ప్రభుత్వపు టనుమతిపత్రమును పొందనిచో ట్రాన్స్‌వాల్‌లో నివసించు హక్కుపోవును. దరఖాస్తు పంపుకొనకపోవుటయు నేరమే. జరిమానాయో! కారాగృహవాసమో, దేశాంతరమునకు తఱిమి వేయఁబడుటయో నేరమునకు శిక్ష.

ట్రాన్స్‌వాల్ ప్రభుత్వపుచర్య దారుణమనిపించినది. భారతీయులము కొందఱము సమావేశమై శాసనములోని విషయములను చర్చించుకొంటిమి. చేయవలసినపనిని నిశ్చయించుకొంటిమి.

సెప్టెంబరు 11 వ తేదీన గొప్ప బహిరంగసభ జరిపితిమి. కొన్ని తీర్మానములు చేసితిమి. ముఖ్యముగ, భారతీయుల అసమ్మతిని సరకుగొనక ప్రభుత్వము ప్రకటించిన ముసాయిదా చట్టమగుచో దానిని ఉల్లంఘించుటకు, తత్ఫలితముగ విధింపఁబడు అన్నివిధములగుశిక్షను అనుభవించుటకు తీర్మానించితిమి. ఆ సాత్త్విక నిరోధోద్యమమునకే సత్యాగ్రహమను పేరు కల్గినది.

మేముచేసిన నిరోధము 'ఆర్డినెన్సు' శాసనమగుటకు అవరోధము గల్గింపలేకపోయినది. ప్రజాభిప్రాయమునకు విరుద్ధముగ కొందఱుమాత్రము చట్టముప్రకారము 'యోగ్యతాపత్త్రములు' తీసికొనిరి. ప్రభుత్వపు 'ఏషియాటిక్ డిపార్ట్మెంట్' బహువిధముల ప్రయత్నించినను 500 మందికంటె యెక్కువమంది 'సర్టిఫికెట్లు' తీసికొనరైరి. కాబట్టి, కొందఱినైన 'అరెస్టు' చేయవలెనని ప్రభుత్వము నిశ్చయించుకొనినది.

పండిత రామసుందర్ జర్మిస్టన్ పట్టణవాసి. మర్యాద కలవాఁడు. కొంచెము వాగ్ధోరణియు నున్నది. ప్రభుత్వపుదృష్టి అతనిపైఁబడినది.

రామసుందర్ను 'అరెస్టు'చేసి 'కోర్టు'లో హాజరు పెట్టిరి. అతఁడు కేవలమొక వ్యక్తివలెగాక, భారతీయుల ప్రతినిధివలె పరిగణింపఁబడెను. న్యాయస్థానమునకు ప్రేక్షకులు పెక్కురువచ్చిరి. రామసుందరునకు ఒకనెల ఖైదు విధింపఁబడెను. భారతీయులానాఁడు పెద్ద ప్రదర్శనములు జరిపిరి.

తుదకేమైనది? రామసుందర్ 'పూటారూపాయి' అనిపించినాఁడు. స్వజాతీయులు, కారాగృహాధికారులుగూడ

ఎంత ఆదరణజూపినను, కారలోనుండుటకతఁ డోర్వకపో యెను. మాయుద్యమమునకు, తన ట్రాన్స్వాల్ నివాసము నకు 'తిలోదకము' లిచ్చిపోయెను.

ఈ వృత్తాంతమును తెల్పుట రామసుందర్ లోపమును ప్రకటించుటకు కాదు; నిష్కలంకమైన ఉద్యమమును నడుపఁ దలఁచిన నాయకులు నిశ్చితబుద్ధులగు యోధులనె సమాద రింపవలెనని హెచ్చరిక చేయుటకే.

# 28

రామసుందరుని అరెస్టువలన ప్రభుత్వము సాధించిన దేమియు లేదు. భారతీయులయుత్సాహ మంతకంత కధికమగు చున్నట్లు ప్రభుత్వము గమనించినది. 'ఇండియన్ ఒపినియన్' పత్రికలో భారతీయుల ఉద్యమవిశేషములు యథాతథముగ ప్రకటింపఁబడుచుండెడివి. ప్రభుత్వపు ఆసియాజాతులవారి శాఖలోని ఉద్యోగులు 'ఇండియన్ ఒపినియన్' పత్రికవలన భారతీయుల ఉద్యమస్వరూపమును, బలమును గ్రహించి, ముఖ్యనాయకులను బంధింపనిదే ఉద్యమమును సమయింపఁ జేయుటకు వీలుకలుగదని నిశ్చయించుకొనిరి.

చట్టముప్రకారము గడువులోపల దరఖాస్తులు పెట్టు కొనలేదను నేరమువోపఁబడినట్లు కొందఱు నాయకులకు 'శ్రీముఖములు' వచ్చినవి. మేజస్ట్రేటు విచారణజరిపెను. ట్రాన్స్వాల్ను విడిచిపొమ్మని 'నేరస్థుల'కు గడువునిర్ణయిం

చెను. అప్పటికి ట్రాన్స్‌వాల్‌ను విడిచిపోవనిచో శిక్షపొందు టకు కోర్టుకు హాజరు కావలెననియు ఉత్తరువులిచ్చెను.

మేజస్ట్రేటు నిర్ణయించిన గడువు—1908 వ సంవత్సరము జనవరి 10 వ తేదీ—దాటినది. మేమల్లెయుంటిమి. కోర్టుకు హాజరైతిమి. మేము ప్రతివాదన చేయదలంచుకొనలేదు. గడువులోపల ట్రాన్స్‌వాల్‌ను విడిచిపొమ్మనిన ప్రభుత్వపు టుత్తరువులను అతిక్రమించిన నేరమును ఒప్పుకొంటిమి.

నేను వాఙ్మూలమిచ్చుచు అందఱికంటె నాకెక్కువ శిక్ష విధింపుమని మేజస్ట్రేటును కోరితిని. కాని, నా కోరిక నతఁడు మన్నింపలేదు. నాకు రెండు నెలలు ఖైదువిధించెను. నేను తఱచుగ న్యాయవాదిగ హాజరైన కోర్టునందె నేరస్థునిగ హాజరుకావలసివచ్చెగదాయని కొంచెముసేపు నాకు మనసు బాధించినది. కాని, యిదియె గౌరవకరమని అంతలో సమాధానము జెప్పుకొంటిని.

న్యాయస్థానమున వందలమంది భారతీయులు, సాటి న్యాయవాదులునుండిరి. శిక్ష చెప్పఁబడినవెంటనె రక్షకభటులు నను వెంటఁబెట్టుకొనిపోయి ఖైదీలకొఱకేర్పడిన యొకగదిలో ఒంటరిగనుంచి, తలుపువేసిపోయిరి. నాతలలో అంతులేని ఆలోచనలు పరుగెత్తినవి. నాఇల్లు, న్యాయవాదవృత్తి, బహిరంగసభ – అన్నియు కలవలె గడచిపోయినవి: ఇపుడు నేను ఖైదీని. రెండు నెలలలో ఏమిజరుగునో? మాటదప్పక భారతీయు లధికసంఖ్యాకులుగ చెఱసాలకువచ్చుచో నేను శిక్షాకాలము పూర్తిగ గడపవలసిన అవసరముండదు. కానిచో, రెండునెలలకాలమే ఒకయుగమనిపించి విసుగుపుట్టించును,–

అని ఒకరీతి. అంతలో మఱియొకరీతి : సిగ్గు, సిగ్గు! ఎంత వాచాలుఁడను! జైళ్లు బ్రిటిష్ సార్వభౌముని 'హోటళ్లు'; జాతివిద్వేషపూరితమైన చట్టము నుల్లంఘించి ఫలితమనుభవించుట గొప్ప అదృష్టము; చట్టనిరోధమున సర్వస్వమును ధారవోయుటయే సంతోషజనకము,—అని ప్రబోధించినది నేనేకదా? ఇంతలో నెక్కడపోయినది ఆ విజ్ఞానము? అని రెండవరీతి. రెండవరీతితలఁపు నాకు క్రొత్త సత్త్వనిచ్చినది. నా మొదటియోచనకు నాకె నవ్వువచ్చినది. అంతలో పోలీసు ఉద్యోగివచ్చి, తలుపుదీసి, నన్ను తనవెంటఁ దీసికొనిపోయెను.

జొహెన్స్‌బర్గు చెఱసాల నా కాతిథ్యమిచ్చినది. నా సహచరులును కొందఱువచ్చి నాతోఁజేరిరి. అందఱము ఒక్కచోట చేరినందుకు సంతోషించితిమి.

## 29

రెండు, మూఁడు రోజులలో సత్యాగ్రహులతో చెఱసాల నిండసాగినది. వారిలో చాలమంది బజారులలో తిరిగి సరకులమ్ముకొనువారు. దక్షిణాఫ్రికాలో బజారులయందు తిరిగి సరకులమ్ముకొనువారు ప్రత్యేకముగ 'లైసెన్సు' పొందవలెను. పోలీసులు అడిగినపుడు లైసెన్సుపత్త్రిములు చూపని వారిని 'అరెస్టు'చేసి చెఱసాలకంపుదురు. ప్రభుత్వము మమ్ము అరెస్టుచేసిరని విని, స్వజాతీయులు కారాగృహము నింపవలెనని కంకణముగట్టుకొనిరి. లైసెన్సులు చూపకుండ అరెస్టుకాఁదగిన సులభమార్గము వారికి తట్టినది. అరెస్టుకాఁబడినవారి

సంఖ్య వారములో వందదాఁటినది. నిత్యము క్రొత్తవారు కారలోఁ జేరుదురనుట నిశ్చయమైనది. చెఱకరుగుటకు సిద్ధమైన సత్యాగ్రహులసంఖ్య నానాఁటికి పెరుఁగుచుండుటచే ప్రభుత్వము కఠినశిక్ష విధింపఁజొచ్చినది.

జొహాన్స్‌బర్గు చెఱసాలలో మాకిచ్చుభోజనము అధ్వానముగనున్నది. పుష్టికరమైన ఆహారము నిండని, వంటకములను సరిగచేయింపుఁడని అధికారులనడిగితిమి. కాని, ఫలితము శూన్యము. తుదకు, మేమె వంటజేసికొనుటకు అధికారు లనుమతించిరి. మాలో తంబినాయని వంటపనికి పెద్దగ ఎన్నుకొంటిమి. మేము వంటచేసికొనుట సాగించిన తరువాత మాస్థితి కొంతమేలైనది.

ఖైదీలసంఖ్య 150 వఱకు పెరిఁగినది. సౌకర్యములెట్లున్నను, శాంతియుతముగ, సంతోషముగ శిక్షాకాలమును గడపుటకు మేము నిశ్చయించుకొంటిమి.

ఒకపక్షము గడచునప్పటికి ప్రభుత్వము భారతీయులతో రాజీకి సంప్రదింపులు జరుపనుండెనని క్రొత్తగ మాతోవచ్చి చేరిన సత్యాగ్రహులు సమాచారముఁదెచ్చిరి. జనరల్ స్మట్స్ నన్ను పిలువనంపెను. ఖైదీలు వెంటనె విడుదలచేయఁబడునట్లు, తగినంతమంది భారతీయులు తమంతఁదామె 'రిజస్టరు' చేయించుకొనుచో ప్రభుత్వము చట్టమును ఉపసంహరించునట్లు రాజీమార్గమును సూచించెను. సత్యాగ్రహినగుటచే రాజీమార్గమును కాదనలేకపోతిని. ఖైదీలకు విడుదలయైనది. స్వజాతీయులకు ఒడంబడిక షరతులను వివరించుట నావంతయినది.

# 30

నేను 'ఏకటాకి' జొహాన్స్‌బర్గుకు వెళ్ళితిని. ఆనాఁడె సభ నేర్పాటుగావించితిమి. రాత్రి 12 గంటలకు సభ జరిగినది. రమారమి 1000 మంది హాజరైనారు. సభలోనున్న పఠానులు కొంతమందితప్ప, తక్కినవారందఱు నేను ప్రభుత్వముతో జరిపిన ఒడంబడికను ఏకగ్రీవముగ నంగీకరించిరి. ఐచ్ఛికముగనైనను తమ వ్రేళ్ళముద్రల నిచ్చుటకు పఠానులు సమ్మతింపలేదు.

అది 1908 వ సంవత్సరము ఫిబ్రవరి 10 వ తేది. మేము కొందఱము 'రిజిస్టరు' చేయించుకొనుటకు సిద్ధమైతిమి. వీలైనంత త్వరితముగ పనిజరుగుట అవసరమనియు, ముందుగ నాయకులె 'రిజిస్టరు' చేయించుకొనవలెననియు అనుకొంటిమి. దీనివలన తక్కినవారును మమ్మనుసరించుట సులభమగుననియు, ప్రభుత్వోద్యోగులు తమవిధులను చెల్లించుటలో యెట్టిమెలకువ చూపుదురో గమనించుటకును అవకాశముండుననియు తలఁచితిమి.

నా కార్యాలయము, సత్యాగ్రహ కార్యాలయము ఒక్కయింటనే. నేను కార్యాలయమును చేరుసరికి పఠాను మీర్ ఆలమ్ కొందఱు అనుచరులతో బయటనిల్చియుండెను. అతఁడు మున్నొకప్పుడు నాకు కక్షిదారుఁడే. అపుడపుడు నా సలహాకై వచ్చుచుండెడివాఁడు. ఆరోజు అతనివర్తనలో కొంత మార్పు కన్పించినది. ఎప్పటివలె లోనికిరాకుండ అతఁడు బయటనిల్చెను. నాకు సలాముపెట్టలేదు. నేనే ముందుగ నమ

స్కారమంటిని. బదులుగ అతఁడు సలామనెను. మామూలు ధోరణిలో, 'క్షేమమా?' అంటిని. అతఁడేమి బదులాడెనో, కాని అతనిముఖములో ఆనాఁడు మామూలుమందహాసమునకు బదులు కోపము కన్పించినది. నేను కార్యాలయములోనికి వెళ్ళితిని. అధ్యక్షుఁడు ఇసాప్‌మియన్, ఇతరస్నేహితులు వచ్చిరి. మేము 'ఏషియాటిక్ ఆఫీసు'కు బయలుదేఱినాము. మా వెనుకనె మీరాలమ్, అతని యనుచరులు బయలు దేఱిరి.

మేము బ్రాండిస్‌వీధిలో పోవుచుంటిమి. మఱి రెండు, మూఁడు నిముసములలో 'రిజస్ట్రేషన్ ఆఫీసు' చేరెడివారము. అంతలో, మీరాలమ్ నాయెదుటకువచ్చి, 'ఎక్కడికివెళ్లుచున్నా'వని నన్ను ప్రశ్నించెను. 'పదివ్రేళ్ళముద్రలిచ్చి 'సర్టిఫికెట్' తెచ్చుకొనుటకు పోవుచున్నాను. నీవు నాతోవచ్చుచో, రెండు బొటనవ్రేళ్ళముద్రలతో సరిపెట్టి ముందుగ నీకు 'సర్టిఫికెట్'ను ఇప్పించి, తరువాత నేను తీసికొందును,' అని బదులుచెప్పితిని. నా సమాధానము ముగియుచుండగనె వెనుకనుండి బలమైన లాఠీదెబ్బ నాతలపైఁబడెను. నేను 'హేరామ!' అనుచు క్రిందబడితిని. మీరాలమ్, అతనియనుచరులు నన్ను చితుకఁగొట్టి పరుగెత్తిరి. నాస్థితిజూచి చుట్టుప్రక్కలనుండి కొందఱు ఆంగ్లేయులు, పోలీసులువచ్చి, పాఱిపోవుచున్న మీరాలమ్‌ను, అతని యనుచరులను పట్టుకొనిరి. నన్ను దగ్గఱనున్న ఒక ఆంగ్లేయుని సొంత కచేరిలోనికి చేర్చిరి. నాకు బాగుగ స్మృతివచ్చునప్పటికి నా మిత్రుఁడు డోక్ నన్ను పరామర్శించుచుండెను. మీరాలమ్ ఏమయ్యెనని ప్రశ్నించితిని. అతఁడు, అతని యను

చరులు 'అరెస్టు' చేయఁబడిరని విని, వారిని వెంటనె విడుదల చేయవలెనంటిని.

పోలీసులు నన్ను ఆస్పత్రికి తీసికొనిపోవుటకు ఏర్పాటులు చేసిరి. కాని, నాకు తనయింటిలో పరిచర్యజరుపుదునని ప్రేమ పూర్వకముగ డోక్ ఆహ్వానించెను. డోక్ ఆహ్వాన మంగీక రించితిని.

ఆసియాజాతుల రిజస్ట్రార్ చామ్నేకూడ నన్ను పరా మర్శించుటకు వచ్చెను. 'రిజస్ట్రేషను'కై నేను ఆయనకార్యా లయమునకే బయలుదేఱితిననియు, దారిలో జరిగిన సంఘటన వలన అనుకొనినప్రకారము జరుగకపోయెననియు చెప్పితిని. ఏమైనను, మొదటి 'సర్టిఫికెట్' నేనే తీసికొనునట్లు ప్రమాణ మొనర్చియుంటిననియు, దానికనుకూలముగ అవసరమైన కాగి తములను నేనున్న చోటికి పంపుమనియు ఆయననర్థించితిని. నా కోర్కెదీర్చుట కాయన సమ్మతించెను.

నేను వెంటనెచేసిన రెండవపని 'అటర్నీ జనరల్'కు తంతినంపుట. నాపై దొమ్మిజరిపిన మీరాలమ్‌ను, అతని యనుచరులను నేను దోషులుగ భావింపనని, వారిని శిక్షింపక నా ప్రార్థనమన్నించి విడుదలచేయుమని 'అటర్నీ జనరల్'ను కోరితిని. నాకోరిక ననుసరించి వారు విడుదలచేయఁబడిరి.

"కాని, నేరస్థులను శిక్షించువిషయమున గాంధి వ్యక్తి గతాభిప్రాయములను దక్షిణాఫ్రికాలో అమలుజరుపుటకు వీలు లేదు. దొమ్మి పట్టణపునడివీధిలో జరిగినది ; దానిని బహిరంగ నేరముగ నెంచవలెను. నేరమును స్వయముగచూచిన ఆంగ్లే యులు పెక్కురు సాక్ష్యమిచ్చుటకు సిద్ధముగనున్నారు. నేరస్థు

లను తప్పక శిక్షింపవలెను," అని జొహెన్స్‌బర్గు ఆంగ్లేయులు 'అటర్నీజనరల్'కు లేఖవ్రాసిరి. దానినిబట్టి మీర్ ఆలమ్, అతని యనుచరుఁడొకఁడు మరల 'అరెస్టు' చేయఁబడిరి. మూఁడు నెలల ఖైదువిధింపఁబడెను. సాక్ష్యమిచ్చుటకు నన్ను పిలువలేదు.

# 31

డాక్టర్ డ్వొయిట్స్ నాకు చికిత్సచేసెను. చీలిపోయిన పై పెదవికి కట్టుకట్టుటచే నేను మాట్లాడుటకు వీలులేకపోయినది. అయినను, నా చేతులు స్వాధీనములోనున్నవి. వెంటనె కాగితముపై స్వజాతీయులనుద్దేశించి చిన్నలేఖవ్రాసి ప్రచురణమున కంపితిని: "డాక్ దంపతులు భ్రాతృప్రేమతో నాకు పరిచర్య జరుపుచున్నారు. నాకు స్వాస్థ్యముకల్గినవెంటనె మరల కార్యరంగమున ప్రవేశింతును. నన్ను కొట్టినవారు తాము ఏమిచేయుచున్నది తెలియక అటులొనర్చిరి. నేను తప్పుచేసితినని వారుభావించిరి. నాపై కసిదీర్చుకొనుటకు వారెఱిఁగిన యొక్కటేమార్గము ననుసరించినారు. వారి నేవిధముగను శిక్షింపవలదు. వారు మహమ్మదీయులని హిందువులు ద్వేషింపవలదు. కానిచో, మానవజాతికి, పరమేశ్వరునకు ద్రోహముజేసిన వారగుదురు. నా శరీరమునుండి చిందిన రక్తధార హిందూ–మహమ్మదీయ సామరస్యమునకు శాశ్వతరక్షాబంధము కావలెనని నా ప్రార్థన. నాపై జరిగిన దౌర్జన్యఫలితముగ నా అభిప్రాయమును మార్చుకొనుటలేదు. ప్రభుత్వ

ముతో జరుపుకొన్న ఒడంబడిక ప్రకారము ఎక్కువమందిమి వ్రేళ్ళముద్రలిచ్చి సర్టిఫికెట్లను తీసికొనవలెను. ఇట్లొనర్చుటకు ప్రత్యేకముగ అంతరాత్మసంబంధమైన ఆక్షేపణలున్నవారిని ప్రభుత్వము మినహాయించును. సత్యాగ్రహికి భగవంతుని యందు తప్ప వేఱుభయముకూడదు. పిఱికితనముతో మతి మాలి బాధ్యతవిడువరాదు. ఐచ్ఛికముగ తగినంతమందిమి 'రిజిస్ట్రేషన్' పొందినచో చట్టమును రద్దుచేయుటకు ప్రభుత్వ మంగీకరించియున్నది. ప్రభుత్వముమాట నిలువఁబెట్టుకొను టకు సాయపడుట మనధర్మము,'' అని వ్రాసితిని.

నేను లేఖవ్రాయుట పూర్తియగునప్పటికి చామ్నె కాగితముల దెప్పించెను. మిక్కిలి బలహీనముగనున్నను, పది వ్రేళ్లముద్రలద్ది 'రిజిస్ట్రేషన్' పూర్తిచేసికొంటిని. నాస్థితి గమ నించుచున్న చామ్నె కన్నులు చెమ్మగిలినవి. అంతకుముందు ఆయనను నేను తీవ్రముగ విమర్శించిన సందర్భములును కలవు. ఆయననుచూచి, పరిస్థితులనుబట్టి మానవహృదయమెంతటి సౌహార్దము బ్రకటింపగలదో గ్రహించితిని.

నాకు శీఘ్రముగ స్వాస్థ్యముకల్గుటకు నేను పూర్తిగ విశ్రాంతిదీసికొనవలెనని డోక్ దంపతులు పట్టుబట్టిరి. అనవసర మైన ఆలోచనలలోగాని, 'వ్రాఁతకోతల'లోగాని నిమగ్నత వలదనిరి. శాంతి, విశ్రాంతికల్గుట కనువుగ నాకు మిక్కిలి ప్రియమైన 'లీడ్ కైండ్లీలైట్' అను ఇంగ్లీషుగీతికను తమ కూఁతురు ఆలివ్–చిన్నపిల్ల–చే పాడింపుడని వారికి కాగిత ముపై వ్రాసిచూపితిని. నాకోర్కెను సంతోషముతో నంగీక

రించిరి. ఆలివ్ మెల్లగ తలుపుకడనిల్చి శ్రావ్యముగ పాడిన పాట యిప్పటికిని నాచెవులలో మార్మ్రోఁగుచున్నది.

# 32

భారతీయులు ఒడంబడికలోని తమభాగమును చెల్లించిరి. ఇఁక మిగిలినది ట్రాన్స్‌వాల్ ప్రభుత్వభాగము – చట్టమును రద్దుచేయుట. ప్రభుత్వభాగము సక్రమముగ చెల్లినచో సత్యాగ్రహము విరమింపఁబడును. కాని, ప్రభుత్వము తన మాటను నిలువఁబెట్టుకొనలేదు. చట్టమును రద్దుచేయలేదు. అంతటితోనైన మిన్నకుండలేదు. భారతీయులు ఐచ్ఛికముగ పొందిన రిజస్ట్రేషనును ఆమోదించుటకు, తక్కినభారతీయులును రిజస్ట్రేషను చేసికొనువసతి గల్పించుటకు జనరల్‌స్మట్స్ శాసనసభలో క్రొత్త 'బిల్లు'ను ప్రతిపాదించెను. ప్రభుత్వపు చర్య నాకు విభ్రాంతిగొల్పినది.

వెంటనె జనరల్‌స్మట్స్‌కు జాబువ్రాసితిని. సాధారణముగ రాజకీయవేత్తలు తమకు ప్రతికూలమైన ప్రశ్నలకు సమాధానమీయరు. ఇచ్చినను, అది 'ఆకుకు అందని, పోకకు పొందని' 'డొంకతిరుగుడు' పద్ధతిలోనుండును.

ఒడంబడికప్రకారము చట్టమును ఉపసంహరించనిచో మేము తీసికొనిన 'సర్టిఫికెట్ల'ను బహిరంగముగ దగ్ధముచేయుదుమని, మాచర్యవలనకలుగు ఫలితముల ననుభవించుటకు సిద్ధముగనుంటిమని, మా నిర్ణయమును ట్రాన్స్‌వాల్ ప్రభుత్వమునకు ఖండితముగ వ్రాసితిమి. క్రొత్తబిల్లు ప్రతిపాదననాఁటికి

ప్రభుత్వపు సమాధానము మాకు చేరవలయుననియు తెల్పితిమి.

అది ప్రభుత్వపుసమాధానము రావలసిన గడువుఱోజు. పెద్దబహిరంగసభ నేర్పరచితిమి. ప్రభుత్వమునుండి అనుకూలమైన సమాధానమురానిచో, దగ్ధముచేయఁబడుటకు 2000 'సర్టిఫికెట్లు' సత్యాగ్రహసంఘమునకు వచ్చినవి. సభ్యులు గొప్ప యుత్సాహముజూపిరి. సభ ప్రారంభమైనది. తీర్మానములు జరిగినవి. ప్రభుత్వమునుండి తంతివచ్చినది—'శుష్కప్రియములు, శూన్యహస్తములు!'—భారతీయుల నిర్ణయము ప్రభుత్వమునకు విచారకరమైనదని, ప్రభుత్వము నిర్ణయించుకొనిన మార్గమును మార్చుకొనఁజాలదని.

ప్రభుత్వమునుండివచ్చిన సమాధానమునువిని, సర్టిఫికెట్లను అగ్నికాహుతిచేయు సదవకాశము తప్పిపోలేదుకదా యను సంతోషమును వెలిబుచ్చిరో అనునట్లు, సభ్యులందఱు కేరింతలుపెట్టిరి. అంతయుసిద్ధమైనది. సర్టిఫికెట్లనన్నిఁటిని గుట్టపేర్చి నిప్పుబెట్టితిమి. భగభగమంట లెగసినవి. సభ్యులెల్లరు పెద్దపెట్టున తమ ఉత్సాహమును ప్రకటించిరి. సర్టిఫికెట్లు మఱికొన్నివచ్చి మంటలోఁబడినవి. సభకువచ్చిన పత్రికాప్రతినిధులు ఆ 'భోగిమంట'నుచూచి ఆశ్చర్యమొందిరి. దృశ్యమునంతటిని కంటికిగట్టినట్లు తమపత్రికలలోఁ ప్రకటించిరి.

1907 వ సంవత్సరముననే ట్రాన్స్వాల్ ప్రభుత్వము 'ట్రాన్స్వాల్ ఇమిగ్రెంట్స్ రెస్ట్రిక్షన్ బిల్లు' ద్వారా క్రొత్తగ భారతీయులు ట్రాన్స్వాల్ రాష్ట్రము జేరుటే దుస్తరముగావించెను. భారతీయులు ఆచట్టమునుల్లంఘింపఁదలఁచిరి. పిద

పటి రెండేండ్ల కాలములో నెటాలునుండి పెక్కుఱు సత్యాగ్ర హులు ఐచ్ఛికముగ ట్రాన్స్వాల్‌ను ప్రవేశించిరి. సరిహద్దు దాఁటగనె చట్టమునుల్లంఘించిరని వారికి చెఱసాల ఆతిథ్య మిచ్చినది. నెటాలునుండివచ్చి కారకేగిన సత్యాగ్రహులతోఁ జేరఁగోరి ట్రాన్స్వాల్ భారతీయులును పలువురు 'లైసెన్సు' లేకుండ బజారులలో కూరగాయలమ్ముట సాకుగ అరెస్టయి చెఱకేగిరి. నానాఁటికి చెఱసాలకువచ్చెడి వారిసంఖ్య అధిక మగుటచే ప్రభుత్వమాందోళన బొందినది. సత్యాగ్రహులను ఖైదుకంపుటకు బదులు దేశాంతరమున కంపసాగినది. అట్ల గుటవలన కొందఱకు ఉత్సాహముతగ్గినది. కాని, పెక్కుఱు స్థిరచిత్తులై ఉద్యమమును సంతోషముగ సాగించిరి.

## 33

కొంతకాలము—1910 వ సంవత్సరమువఱకు—చెఱసాల కేగిన సత్యాగ్రహుల కుటుంబముల పోషణమునకు డబ్బుఇచ్చు చుండెడివారము. ఆపద్ధతి తృప్తికరముగ లేకపోయినది. మఱి యొక సమస్యయుగలదు. చెఱనుండి తిరిగివచ్చిన కాలములో నైన సత్యాగ్రహులకు ఉద్యోగములు లభింపవయ్యె. సత్యా గ్రహులు కుటుంబములతోసహా ఒకచోట నివసించుచు సహ కారపద్ధతిపై పనిపాటులు చేసికొనునట్లు ఏర్పాటుచేయఁగల్గి నచో రెండుసమస్యలును తీరునని నిశ్చయించితిమి.

కాలెన్‌బాచ్ అను జర్మనుశిల్పి నాకుఆప్తమిత్రుఁడు. అతఁడు లాలె రైల్వేస్టేషను సమీపమున 1100 ఎకరముల భూమిని ఉచితముగనిచ్చి తనయౌదార్యము బ్రకటించెను.

కాలెన్‌బాచ్ ఇచ్చినభూమిలో పండ్లచెట్లు, నీటివసతి యున్నవి. కొన్నిపాకలు వేసితిమి. దాదాపు 60 మంది మగ వారు, 10 మంది స్త్రీలు నివసించుటకు ఏర్పాటుచేసితిమి. స్త్రీలకు ప్రత్యేకముగ వసతిగల్పించితిమి. కాలెన్‌బాచ్ కొక ప్రత్యేక కుటీరము, పిల్లలకు బడియొకటి, వడ్రంగము, చెప్పులు కుట్టుట మొదలగు పరిశ్రమలకు కొట్టములు నిర్మించితిమి. వసతు లన్నియు సొంతముగ ఏర్పరచితిమి. నౌకరులను, కూలీలను పెట్టుకొనలేదు. పాకలు వేసినదియు మేమే. వంటనుండి ఊడ్పు



1913 టాల్‌స్టాయ్ కేంద్రంలో

పనివఱకు అంతయు స్వయంసాహాయ్యమే. ఈ టాల్‌స్టాయ్ కేంద్రములో మేముచేసిన కాయకష్టము అమృతతుల్యమైనది.

టాల్‌స్టాయ్ కేంద్రములో వసింపవచ్చినవారిలో గుజ రాతీలు, తమిళులు, ఆంధ్రులు, ఉత్తరహిందూస్థానీయులు

నుండిరి. వారు వివిధమతములవారు : హిందువులు, మహమ్మదీయులు, పార్సీలు, క్రైస్తవులు.

టాల్‌స్టాయ్ కేంద్రమునుండి జోహాన్సబర్గుకు పోయి రావలెనన్న కొన్నినియమము లేర్పరచుకొంటిమి. ప్రత్యేకముగ పనియున్నపుడుమాత్రమె రైలుబండిలో, మూఁడవతరగతి ప్రయాణము. సరదాగ పోయిరావలెనన్న చో కాలినడక. కాలినడకకు పిల్లలును మిక్కిలి యుత్సాహముజూపిరి. జోహాన్సబర్గుకు పోయినచో మా కేంద్రములో తయారైన వస్తువులను తీసికొని వెళ్ళి అమ్ముకొనిరావలెను. అచట 'హోటళ్ల'లో డబ్బు వెచ్చింపరాదు. కావలసిన తినుబండారములను ఇంటినుండియే తీసికొనిపోవలెను. ఇట్టి నియమములు లేనిచో ఈ పల్లె కేంద్రములో కష్టించి ఆర్జించిన సొమ్ము 'రైళ్లకు', పట్టణమున 'హోటళ్లకు' అర్పణమయ్యెడిదియే.

జోహాన్సబర్గు ప్రయాణమున్నచో వేకువనె రెండు గంటలవేళ నిద్రమేల్కొనవలెను. వెంటనె నడకసాగవలెను. నాఁటిరాత్రికి తిరిగి యిలుజేరవలెను. తీసికొనిపోవు తినుబండములు: ముడిరొట్టె, వెన్నవలెనుపయోగించు వేరుశనగ గుజ్జు, మిఠాయి—అన్నియు ఇంటిలో తయారైనవే.

టాల్‌స్టాయ్ కేంద్రమును చక్కని పరిశ్రమస్థానముగ నొనర్చి కొంతవఱకైన స్వయంపోషకమొనర్పవలెనని, ప్రభుత్వముతో అవసరమైనంతకాలము పోరాడుటకు వలసిన శక్తి సమకూర్చుకొనవలెనని మా సంకల్పము. చెప్పులు తయారుచేయుటకు చిన్నకర్మాగారము నెలకొల్పితిమి. చెప్పులుకుట్టుట తొలుత కాలెన్‌బాచ్ నేర్చుకొని, తరువాత నాకునేర్పెను,

నాద్వారా తక్కినవారు నేర్చుకొనిరి. నేను కొన్నిదజనులజోళ్లు తయారుచేసితిని. చెప్పులను అమ్మి సొమ్ముగడించితిమి. వడ్రంగపుపనులవలనఁగూడ కొంత ఆదాయము వచ్చినది.

పిల్లలకు చదువుచెప్పుట కొంతకష్టమైనది. మధ్యాహ్నము బడిపెట్టెడివారము. ముఖ్యముగ కాలెన్ బాచ్, నేను ఉపాధ్యాయులము. ఉదయమంతయు శ్రమజేసియుండుటచే బడివేళకు మేము, పిల్లలుగూడ అలసియుండెడివారము. కునుకు రాకుండ చల్లనినీటితో కన్నులుతుడుచుకొని చదువు ప్రారంభించెడివారము. ఇంకొక చిక్కు కలదు. గుజరాతి – అరవ – తెలుఁగు పిల్లలున్నారు. మాతృభాషలో పాఠములు బోధింపవలెనని నా ఆశయము. నాకు కొంచెము తమిళము తెలియును. తెలుఁగు 'రానేరాదు'. ఏమిచేయుట?

ఏమైనను, మేము బడిలోజేసిన శ్రమయు ఫలింపకపోలేదు. పిల్లలకు హెచ్చుగ పరమతసహిష్ణుత, అన్యోన్య సాహాయ్యము, మర్యాద, పరిశ్రమ మొదలగు సుగుణములలవడినవి. అందఱు ఒకతల్లిబిడ్డలవలె మెలఁగుట నేర్చుకొనిరి. టాల్‌స్టాయ్ కేంద్రములో చదివిన విద్యార్థులు చక్కనిప్రవర్తనతో జీవితములు గడపుచుండిరని తరువాతగూడ విని, మా పరిశ్రమ ఫలవంతము కాకపోలేదని ఆనందించితిని.

# 34

ప్రభుత్వమునకు—సత్యాగ్రహులకు రాజీచేయుయత్నములో గోపాలకృష్ణగోఖ్లె 1912వ సంవత్సరమున దక్షిణాఫ్రి

కాకవచ్చెను. జనరల్ బోథాతో సంప్రదించి, పరిస్థితులన్నియు చక్కఁబడుననియు, మఱుసటివత్సరము జాతివిభేదక చట్టమును, మూఁడుపౌనుల పన్నుపద్ధతిని ప్రభుత్వము రద్దుచేయుననియు తెల్పెను.

ఏఁడాదిగడచినది. ప్రభుత్వపుధోరణిలో మార్పు లేదు. మూఁడుపౌనుల పన్నుపద్ధతిని రద్దుచేయించుటకై టాల్‌స్టాయ్ కేంద్రవాసులు సత్యాగ్రహమును ప్రారంభించుటకు నిశ్చయమైనది.

ఇంతదనుక సత్యాగ్రహసమరమున స్త్రీలు పాల్గొనలేదు. భర్తలతోబాటు చెఱకేగుటకు వారు ఉత్సాహముజూపినను, వలదని మేమె వారించితిమి. కాని, వారికోరిక తీరుటకు క్రొత్తయవకాశము వచ్చినది. క్రైస్తవమతాచారముల ప్రకారము జరుగనట్టియు, పెండ్లిండ్ల 'రిజస్ట్రార్' చెంత 'రిజస్టర్' కానట్టియు పెండ్లిండ్లు చెల్లవు—అను తీర్పును దక్షిణాఫ్రికా ప్రభుత్వము అమలుపఱచినది. ఈ తీర్పుతో హిందూ - మహమ్మదీయ - జొరాస్ట్రియన్ మతాచారముల ప్రకారము జరిగిన వివాహములన్నియు న్యాయబద్ధములుకావని తేలినది. దాదాపుగ దక్షిణాఫ్రికాలోని భారతీయమహిళలందఱు 'న్యాయసమ్మతము' కాని 'భార్యలు - అనినట్లయినది. ఇంతటి దారుణము - భారతమహిళల కింతటి తలవంపు - కల్గినతరువాత సత్యాగ్రహములో స్త్రీలు పాల్గొనరాదని చెప్పుటకు మాకు నోరాడలేదు. మేమె వారిని సత్యాగ్రహమున కాహ్వానింప నిశ్చయించితిమి.

తొలుత టాల్‌స్టాయ్ కేంద్రములోని సోదరీమణులతో

సత్యాగ్రహమునుగూర్చి ప్రస్తావించితిని. చెఱసాలకేగినచో అచట ఇక్కట్టులు పడవలసియుండునని ముందుగనె నొక్కి చెప్పితిని. ఏమన్నను, వారు సత్యాగ్రహమున పాల్గొనుటకు మిక్కిలి యుత్సాహముజూపిరి. పసిబిడ్డల తల్లులును సిద్ధమైరి.

నెటాలునుండి ట్రాన్స్వాలుకుగాని, ట్రాన్స్వాలు నుండి నెటాలుకుగాని, ప్రభుత్వపుటనుమతిలేకుండ పోయిన వారిని అరెస్టుచేసి కారకంపుదురు. కావున, కొలుత కొందఱిని ట్రాన్స్వాలుకు పంపఁదలఁచితిమి. వారచట అరెస్టుచేయఁబడనిచో, నెటాలుకు తిరుగవలెను; నెటాలుహద్దులలోగూడ అరెస్టుచేయఁబడనిచో 'ఎకామెకి' న్యూకాసిల్‌కు పోయి అచటి గనులలోని కార్మికులను ప్రబోధించి సమ్మెచేయించవలెను,— ఇది వారికి కార్యక్రమము. న్యూకాసిల్ గనులలోని పనివాండ్రలో ఎక్కువమంది తమిళులు, తెలుఁగువారు.

నేను ఫినిక్స్‌కువెళ్ళి అచటి సోదరీమణులతో సత్యాగ్రహమునుగూర్చి మాట్లాడితిని. వారిలోచాలమంది నాకు బంధువులే. నేను చెప్పితినన్న కారణముననే చెఱకేగుటకు సమ్మతింపవలదనియు, ఎవరికివారు సొంతముగ ఆలోచించి, నిర్ణయించుకొనవలెననియు స్పష్టముగ దెల్పితిని. శిక్షాకాలము పూర్తిగ చెల్లించుటకు, ఎట్టికష్టములనైన ఓపికతో సహించుటకు సిద్ధమైనవారుమాత్రమె సత్యాగ్రహమున పాల్గొనవలెనంటిని. అందఱును చెఱకేగుటకు సిద్ధమైరి.

సత్యాగ్రహముమాట నా భార్యతో చెప్పలేదు. నేనేమిచెప్పినను ఆమె కాదనదు. కాని, అట్లు ఒప్పించుట నాకిష్టములేదు. ఇట్టి క్లిష్టసమస్యలను భార్య స్వేచ్ఛగ ఆలోచించి

నిర్ణయించుకొనవలెనని నా యుద్దేశ్యము. తక్కిన సోదరీమణు లతో నేను మాట్లాడుచుండుట విని, ఆమెవచ్చినది. "తక్కిన సోదరీణులవలె ధైర్యసాహసములు, సహనము, త్యాగము నేను ప్రకటింపఁజాలనని మీరేల తలఁచెదరు? మీరు, పిల్లలు గూడ కష్టములను సహించుచుండ నేను వెనుకాడుదునా? ఏమైనను, నేనుగూడ తప్పక ఉద్యమమున పాల్గొందును," అని ఆమెపల్కినది. ఆమెపట్టుదలను గమనించి సమ్మతించితిని. ఫినిక్స్ఆశ్రమ మేమైనను, సత్యాగ్రహుల ఆరోగ్యమెట్లైనను, సమరమెంతకాలము జరిగినను, చివరవఱకు నిలుచుటకు నిశ్చయించుకొనినవారు మాత్రమె సత్యాగ్రహమునఁ జేరవలెనని మరల స్పష్టముగ నుడివితిని.

ఫినిక్స్వాసి కాకున్నను, పార్శీ రుస్తుంజీయును సత్యాగ్రహమునఁ జేరెను. అతనిని అందఱు 'కాకాజీ' అని ప్రేమతో బిలుచుచుందురు. కాకాజీ అంతకుముందు సమరములో పాల్గొని బందిఖానాపొందు చూచినవాఁడే. మరల చెఱకేగుట కతఁడును సంసిద్ధుఁడయ్యెను.



1913 దక్షిణాఫ్రికా సత్యాగ్రహనాయకుడుగా

అంతయు అనుకొనినట్లై జరిగినది. సత్యాగ్రహము జరిపిన సోదరీమణులను ట్రాన్స్వాలునందుఁగాని, నెటాలులోఁగాని అరెస్టుచేయలేదు. వారు న్యూకాసిల్కుపోయి

తమపని సాగించిరి. మూఁడుపౌనుల పన్నువిషయమును విని కార్మికులు 'మండిపడిరి'. తత్క్షణమె సమ్మె ప్రారంభమైనది. ప్రభుత్వము మిన్నకుండ లేకపోయినది. సత్యాగ్రహము జరిపిన సోదరీమణులకు కారాగృహము స్వాగతమిచ్చినది.

# 35

సత్యాగ్రహసమరమున స్త్రీలు ప్రకటించిన ధైర్య సాహసములు వర్ణనాతీతము. మారిట్జ్‌బర్గ్ చెఱసాలలో వారిని మిక్కిలి హింసించిరి. చేయించినది చాకిపని; ఇచ్చినది 'బిచ్చపుతిండి'.

కస్తూరిబాయిగాంధికి ఆహారవిషయమున కొన్ని నియమములున్నవి. మిక్కిలి కష్టముమీఁదగాని ఆమెకు నూనె మొదలగువానినైన నీయరైరి. అదియు 'మాగి మట్టిబట్టినది' యే. ఆమె చెఱవదలివచ్చునప్పటికి శల్యావశిష్టయైనది. మిక్కిలి శ్రమ జరిగినపిదప ప్రాణాపాయము తప్పినది.

ఒకసోదరి చెఱనుండి జ్వరముతో వచ్చినది. జ్వరమె ఆమెకు మృత్యువుదెచ్చినది. అది మఱపురానిమాట. ఆమె పదునాఱేండ్ల బాలిక. జోహాన్స్‌బర్గు నివాసిని. ఆమె చిక్కి మంచముబట్టినపుడు చూచుటకు వెళ్ళితిని. "వళ్ళియమ్మా! చెఱసాలకు వెళ్ళివచ్చినందుకు చింతించుచుంటివా?" అని, ఆమెను ప్రశ్నించితిని. ఆలోచింపకయె అన్నది–'కాదు, కాదు– అరెస్టుచేసినచో ఇంకొకమాఱు వెళ్లుటకైన సిద్ధముగనుంటిని. మాతృదేశమునకై అసువులనైన అర్పించుటకెవ్వరు వెను

డీయుదురు ?'—అని. అట్లనిన కొన్నినాళ్లకె ఆమె పర లోకమున కేగినది. ఆమె పేరుమాత్రము చిరస్థాయిగ నిల్చును.

మహిళలు ప్రకటించిన త్యాగము నిరుపమానమైనది. నిర్మలమైన త్యాగము, భక్తి, భగవానునకు ప్రీతికరములు. స్వార్థపరత్వములేక, చిత్తశుద్ధితో అనాథ తృణమిచ్చినను భగవంతుఁడు స్వీకరించును. నూఱుమ్మడుఁగుల ప్రతిఫలము జూపును. భక్తసుధాముఁ డర్పించినది పిడికెడటుకులే. వానితో నతనికి బహుకాలమున్న దారిద్ర్యక్షుద్బాధలు తొలఁగిపోయినవి. పెక్కుర చెఱ కేగుటవలన ఫలితము లేకపోవచ్చును ; కాని, ఒక్క నిర్మలాత్మ చేసిన పరిపూర్ణ త్యాగము ఫలింపక పోదు. దక్షిణాఫ్రికాలో వల్లియమ్మ చూపిన త్యాగము భగవంతుని మెప్పుపొందగలదని నా నమ్మకము.

దేశసేవలో, మానవసేవలో మున్ను ఎందఱో అసువులర్పించిరి. నేఁడు, రేపు గూడ అట్టివారెందఱో యుందురు. అది స్వాభావికము. వారిలో నిర్మలమూర్తులెవ్వరో చెప్పలేము. కాని, నిర్మలాత్ముఁడొక్కఁడున్నను, అతని త్యాగము ఫలవంతమగునని సత్యాగ్రహులు విశ్వసింపవలెను. ప్రపంచము సత్యముపై ఆధారపడియున్నది. సత్యము స్థిరమైనది; నాశరహితమైనది ; ఎల్లపుడు జయించునది. ఇదియె సత్యాగ్రహమునకు మూలసూత్రము.

# 36

స్త్రీలు చెఱసాలకేగిరను వార్తలువిని న్యూకాసిల్ ప్రాంతపుగనులలోని కార్మికులు పనులుమాని పట్టణములోనికి బయలుదేఱిరి. నేను ఫినిక్సునుండి వెంటనె న్యూకాసిల్ చేరితిని.

కార్మికులు నన్ను కలిసిరి. నమ్మొకు కినిసిన తమ యజమానులు పెట్టినబాధలు చెప్పసాగిరి. ఒక పఠాణ్ కార్మికుఁడు వీపుపై యజమానులు కొట్టిన దెబ్బలు చూపించి, "నీ మాటకు కట్టుబడితిని; లేకున్న వారికి 'వడ్డీతోగూడ చెల్లిచ్చెడి' వాఁడను. పఠానులు దెబ్బకొట్టుటెఱుఁగుదురు, కాని, తిను టెఱుఁగరు" అనెను. అతని సహనమునకు మెచ్చితిని. అట్టి వారివలననె ఉద్యమము ఫలించునంటిని.

కార్మికులు వందలు, వేలునైరి. వారికందఱకు భోజనము, నివాసము ఎట్లు, ఎక్కడ? వారిని ట్రాన్స్‌వాలుకు తీసి కొనిపోయినచో ప్రభుత్వపు బందిఖానాలు ఆతిథ్యమిచ్చును,- అని పరిష్కారమార్గము తోఁచినది. దాఁదాపు ఐదువేలమంది. రైలులో ప్రయాణించుటకు డబ్బులేదు. ట్రాన్స్‌వాలు సరిహద్దు న్యూకాసిల్‌కు 36 మైళ్ళు. నడక తప్పదని తీర్మానించితిని. ఇష్టములేనివారు తిరిగి గనులకు వెళ్లవచ్చునంటిని. అందఱును 'జైత్రయాత్ర'కే సమ్మతించిరి.

'జైత్రయాత్రకు' ఏర్పాటులు జరుగుచున్నవి. బొగ్గు గనుల యజమానులు నాకు కబురంపిరి. డర్బానుకు వెళ్ళి

వారిని కలిసికొంటిని. వారిధోరణి వారిదే. మూడుపౌనుల పన్నును తొలగింపుమని ప్రభుత్వమును కోరుటకైన వారు సమ్మతింపరైరి.

న్యూకాసిల్‌కు తిరిగివచ్చితిని. బొగ్గుగనుల యజమానులు పల్కిన బెదరింపులు తెల్పితిని. చెఱకేగుటయందు గల్గు కష్టములను వివరించితిని. ఎన్నిచెప్పినను, ఉద్యమమును సాగించుటయె తమ నిశ్చయమని వారనిరి. 1913 వ సంవత్సరము అక్టోబరు 18వ తేదీ ‘జైత్రయాత్ర’కు ప్రారంభోత్సవము. దారిలో ఒక్కొక్కరికి రోజుకు 1½ పౌనురొట్టె, 1 ఔన్సు చక్కెర తప్ప మఱేమియు నీయజాలనంటిని. “ఇతరుల వస్తువులను ముట్టరాదు; అధికారులెవరైన పరిహసించినను, తిట్టినను, కొట్టినను సహింపవలెను; ‘అరెస్టు’ అగుటకు అభ్యంతరము జెప్పరాదు; నన్ను ముందుగ అరెస్టుచేసినను శాంతియుతముగ యాత్ర జరుగవలసినదే” అనియు చెప్పితిని. వారందఱును సమ్మతించిరి.

‘శాంతిసేన’తో ఛార్లెస్‌టౌను చేరితిని. భారతీయవర్తకులు చాలవిధములుగ సాయమొసర్చిరి. ఛార్లెస్‌టౌనులో కొన్నినాళ్లు మకాముచేయవలసివచ్చినది. పిల్లలు, స్త్రీలును మాత్రము ఇండ్లలో, తక్కినవారు మైదానమున మకాము. వంట సొంతమే.

పరిసరములను శుభ్రముగ నుంచుకొను విషయమున కొంత కష్టమైనది. అయినను, నాయకుడు స్వయముగ పనికి పూనుకొనినచో తక్కినవారును అనుసరింతురు. నాయకుడు హుకుములిచ్చుటతో తృప్తిపొందినచో, పనిజరుగుట కష్టమును

సంగతి నా కనుభవమే. ఊడ్పుపనిలో నేను, నా సహచరులు దిట్టమైనవారమే. అందఱును సంతోషముతో మమ్మనుసరించిరి.

'శాంతిసేన' ఆహారవిషయమునను మిక్కిలి ఓర్పు బ్రకటించెను. వంటపనిలో, వడ్డనపనిలో నాయకత్వము నాదియే. వంట చెడినను, వడ్డించినది తక్కువయైనను, సంతోషముగ సరిపెట్టుకొనిరి. తమకు వడ్డించిన పదార్థములు చాల లేదని ఒకసారి స్త్రీలు కన్నెఱ్ఱజేసిరి. "ఏమిచేయుదును? ఉన్న పదార్థము తక్కువ; తినవలసినవారు పెక్కురున్నారు; అందఱకును సమముగ పంచితిని" అనిన నా సమాధానముతో వారును తృప్తినొందిరి.

## 37

ఛార్లెస్ టౌనుండి ప్రభుత్వమునకు జాబు వ్రాసినాను – "ట్రాన్స్‌వాలును ప్రవేశింపనుంటిమి; అవమానకరమైన మూడుపౌనుల పన్నువిషయమున శాంతియుతముగ మా అసమ్మతిని ప్రదర్శింతుము; మమ్ము ఛార్లెస్ టౌనులో నున్నపుడె అరెస్టు చేయవచ్చును; పన్నుతీసివేయుటకు ప్రభుత్వము సమ్మతించినచో మాయాత్రను మానుకొందుము" అని.

ప్రభుత్వమునుండి సమాధానము రాలేదు. ఛార్లెస్ టౌనులో మమ్ము అరెస్టుచేయు సూచనలును కన్పింపలేదు. ఛార్లెస్ టౌనును విడిచి ట్రాన్స్‌వాలు ప్రవేశించుటకు నిశ్చయించితిమి. దారిలో మమ్ము అరెస్టుచేయనిచో, టాల్‌స్టాయ్

కేంద్రముజేరి, సమరము పూర్తియగువఱకు అచటనుండుట నిర్ణయము. టాల్‌స్టాయ్ కేంద్రములో కాలెన్‌బాచ్ అవసరమైన యేర్పాటులు గావించినాఁడు.

ఛార్లెస్‌టౌఁలోని ఆరోగ్యశాఖాధికారి డాక్టర్ బ్రిస్కో మాయెడ ఆదరముజూపెను. అవసరమున కుపయోగించునని మావెంట నుంచుకొనుటకు మందులపెట్టె నిచ్చెను.

దినమునకు 20, 25 మైళ్ళచొప్పున 8 రోజుల ప్రయాణము జరుగవలెను. దారిలో రొట్టెదొరకుటయుఁ గష్టము. ఏమిచేయుట? పెద్దప్రయత్నముమీఁద ఒక ఐరోపియనుల రొట్టెదుకాణమువారు రైలుమీఁదపంపి మా మకాముల కన్నిఁటికి రొట్టె సరఫరాచేయుటకు సమ్మతించిరి. మంచి రొట్టెను మామూలుఖరీదుకే సక్రమముగ సరఫరాచేసిరి. ఐరోపియనులగు రైల్వే ఉద్యోగులును రొట్టెలు భద్రముగ, సకాలములో మాకు అందునట్లు జాగ్రత్తతీసికొనిరి. మాకెవ్వరియందును ద్వేషములేదని వారెఱుఁగుదురు.

యాత్రను మరల బయలుదేఱఁదీయుటకుముందు ప్రభుత్వము పరిష్కారమార్గమును చూచునేమోయని ప్రయత్నించితిని. అప్పటికె ప్రభుత్వమునకు జాబులు, 'టెలిగ్రాములు' పంపితిని. ఈసారి 'టెలిఫోను'లో జనరల్ స్మట్స్‌తో సంభాషింపఁబూనితిని. టెలిఫోన్ మ్రోఁగినది. "జనరల్‌స్మట్స్ చెప్పవలసినదిలేదు ; నీవేమైన చేసికొనుము" అని, అఱనిముసములో సమాధానము వచ్చినది. అంతియే. టెలిఫోన్ ఆఁగినది. సాగినది మఱునాఁడె మరల జైత్రయాత్ర, మహాజను

లతో-2037 మంది పురుషులు, 127 మంది స్త్రీలు, 57 మంది పిల్లలతో.

# 38

'శాంతిసేన'తో ట్రాన్స్వాలు సరిహద్దు నంటియున్న వోక్‌స్రస్ట్ పట్టణము జేరితిని. అచట అశ్వారూఢులైన పోలీసు లుండిరి. నేను రెండడుగులు ముందుకు వేసి వారితో మాట్లాడు చుంటిని. 'దండు' త్రోసికొని వచ్చినది. సేనను క్రమముగ బారులుదీర్చి ట్రాన్స్వాల్ ప్రవేశించితిమి.

అప్పటికి రెండురోజులక్రిందట వోక్‌స్రస్ట్‌లోని ఐరోపియనులు పెద్దసభ జేసి మా 'దండయాత్ర'ను భంగము జేయుదుమని బెదరించిరి. మేము ట్రాన్స్వాలులో కాలుపెట్టిన వెంటనె మమ్ము కాల్చి వేయుదుమనియు కొందఱనిరట. సభకు కాలెన్‌బాచ్ హాజరయ్యెను. భారతీయులకు జరిగిన అన్యాయమును వారికి నచ్చఁజెప్పుటకు ప్రయత్నించెను. కాని, వారి చెవికెక్క లేదు.

ఐరోపియనులు జరిపిన సభసంగతి మాకు తెలిసినది. శాంతియుతముగనుండుమని 'దండు'ను హెచ్చరించితిని. పట్టణము బ్రవేశించితిమి. పట్టణములోని ఐరోపియనులు మమ్ము వింతగచూచిరి. పరిహసించనైనలేదు. కొందఱిచూపులలో స్నేహచిహ్నములు చదివితిని.

మొదటిరాత్రి పామ్‌ఫోర్డ్‌లో విశ్రమించితిమి. పసిబిడ్డల తల్లులు కొందఱు మిక్కిలి అలసిపోయిరి. వారిఁక నడ

చుటకు శక్తిలేదు. వారిని టాల్‌స్టాయ్ కేంద్రమునకు చేర్పుమని నమ్మకమైన ఒక భారతీయవర్తకున కప్పగించితిమి. అందఱు అలసి నిద్రించిరి. రాత్రిప్రొద్దు గడచినది. నేనును విశ్రమింపఁబోవుచుంటిని. కొంచెము సవ్వడి వినిపించినది. ఒక ఐరోపియను ఉద్యోగివచ్చి నన్ను అరెస్టుచేసెను. పి. కె. నాయుఁడు అను సహచరునిమాత్రము మేల్కొల్పి, మఱునాఁడు మామూలుగ యాత్రసాగింపుమని చెప్పి, నే నా యుద్యోగివెంట వెళ్ళితిని.

నన్ను వోక్రస్ట్ చేర్చి కోర్టులో హాజరుపెట్టిరి. నన్ను జామీనుపై విడుదలచేయుమని వెంటనె దరఖాస్తుపెట్టితిని. నా దరఖాస్తుకు ప్రతికూలముగ 'పబ్లిక్ ప్రాసిక్యూటర్' తీవ్రముగ వాదించెను. మరణశిక్ష విధింపఁదగిన నేరముచేయని ఖైదీలను విచారణ జరుగువఱకు జామీనుమీఁద విడుదల చేయుటకు న్యాయశాస్త్రము సమ్మతించునని వాదించితిని. మేజస్ట్రేటు నన్ను జామీనుపై విడుదలచేసెను. నాకై వేచియున్న కాలెన్‌బాచ్‌తో వెంటనే బయలుదేఱి శాంతిసేనను కలిసికొంటిని.

స్టాండర్టన్ పట్టణముజేరిన పిమ్మట నేను శాంతిసేనకు రొట్టెపంచుచున్న సమయమున మేజస్ట్రేటు వచ్చెను. రొట్టె పంపిణీ పూర్తియగువఱకు వేచియుండి, నన్ను అరెస్టుచేసి కోర్టుకు తీసికొనిపోయెను.

కోర్టులో మరల నా జామీను దరఖాస్తు, మరల 'పబ్లిక్ ప్రాసిక్యూటర్' ప్రతికూలవాదన. ఏమైనను, నన్ను



సి. యఫ్. ఆండ్రూస్, డబ్ల్యు. డబ్ల్యు. పియర్సన్‌లతో.

బామీనుమీఁద విడుదల జేసిరి. వెంటనే సాగిపోవుచున్న 'మహా యాత్రికుల'తో గలిసితిని.

మా యాత్రకు ఎనిమిదిమజిలీల నేర్పరచుకొంటిమి. నాలుగు మజిలీలుఁగడచి, జొహాన్స్‌బర్గు సమీపింపవచ్చితిమి. యాత్రికుల యుత్సాహము హెచ్చుచున్నది. మమ్ము మా మార్గమున పోవనిచ్చుటయా, లేక చర్యదీసికొనుటయా, అను ఆలోచనలతో ప్రభుత్వపు ఆందోళనయు హెచ్చు చున్నది.

ఇట్టిపరిస్థితిలో తాను దక్షిణాఫ్రికా భారతీయులస్థితిని భారతప్రభుత్వమునకు, సామ్రాజ్య ప్రభుత్వమునకు నివేదింప నుంటిననియు, తనకు విషయములను వివరించుటకు హెన్రీ పోలక్‌ను పంపుమనియు గోపాలకృష్ణ గోఖ్లె నాకు వార్త నంపెను. భారతదేశమునకు పొమ్మని పోలక్‌కు వ్రాసితిని.

భారతదేశమున కేగుటకు ముందు . నాతో మాట్లాడ వలెనని పోలక్ వచ్చి టీక్‌వర్త్ పట్టణముచెంత మమ్ము కలిసి కొనెను. నేను, పోలక్ మాట్లాడుకొనుచు ముందు నడచు చుంటిమి. మా వెంట మహాయాత్రికులు. అంతలో పోలీసు అధికారి ప్రత్యక్షము. నన్ను అరెస్టుచేసిరి. అప్పటికి నాలుగు రోజులలో నన్ను ముమ్మాఱు అరెస్టుచేసిరి. యాత్రనడపుమని పోలక్‌తో చెప్పి, అధికారివెంట వెళ్ళితిని.

పోలక్ నాయకత్వమున శాంతిసేన గ్రేలింగ్‌స్టాడ్ దాఁటి, బాల్ఫర్ పట్టణము జేరెను. బాల్ఫర్ స్టేషనులో ప్రత్యే కము మూఁడు రైలుబండ్లను సిద్ధముచేసి, మహాయాత్రికులను అరెస్టుచేసి వానిలో నెటాలుకు పంపివేయుటకు ప్రభుత్వాధి

కారులు సన్నాహము జరిపిరి. నా సలహాలేనిదే రైలెక్కమని, నన్నచటకు పిలిపింపుమని యాత్రికులు పట్టుబట్టిరి. తుదకు పోలక్, కచాలియా సేఠ్ ఎట్లయినను కారాగారమె తమలక్ష్యమని వారికి నచ్చఁజెప్పిరి. మహాయాత్రికులు శాంతముగ రైలెక్కిరి.

# 39

నన్ను డండీనుండివచ్చిన 'వారంటు'పై 'అరెస్టు' చేసిరి. రైలులో నాఁటిరాత్రియె డండీకి తీసికొనిపోయిరి.

పోలక్‌ను బాల్ఫరులో అరెస్టుచేయక, తమ కచట సాయముజేసెనని అధికారులతనిని ప్రశంసించిరి. కాని, రైలుబండికై వేచియున్నపుడు ఛార్లెస్ టౌనులో అతనిని అరెస్టు చేసిరి. కాలెన్‌బాచ్‌నిగూడ అరెస్టుచేసిరి. వారి నిద్వురను వోక్‌స్రస్ట్ చెఱసాలలోఁ బెట్టిరి.

డండీలో విచారణ జరిగినది. నాకు తొమ్మిదినెలలు కఠినశిక్ష విధింపఁబడినది.

డండీనుండి నన్ను వోక్‌స్రస్ట్‌కు తీసికొనిపోయిరి. నిషిద్ధవ్యక్తులు ట్రాన్స్‌వాలు ప్రవేశించుటకు ప్రోత్సహించితినను నేరమునకు వోక్‌స్రస్ట్ కోర్టులో విచారణ జరిగినది. అచట పోలక్‌ను, కాలెన్‌బాచ్‌ని కలిసికొనఁగల్గినందుకు సంతోషించితిని. ఒక్కొక్కరికి మూఁడు నెలలు కారాగారవాసము విధింపఁబడినది. వోక్‌స్రస్ట్ చెఱసాలలో కొన్నినాళ్లు ప్రశాంత

ముగ గడిపితిమి. ప్రతిదినము క్రొత్తఖైదీలు వచ్చుచుండెడి వారు. వారివలన సమాచారములు తెలియుచుండెడివి.

నా అరెస్టునుగూర్చి విని పెక్కురు భారతీయులు ఉత్సాహముతో నెటాలు సరిహద్దుదాటి ట్రాన్స్వాలులో కాలుపెట్టి కారాగృహమునకు వచ్చిరి. అట్టివారిలో 75 ఏండ్ల వయస్సుగల హర్బత్ సింగ్ అనునతఁడుండెను. అతనినిచూచి, "నీవంటివృద్ధులు చెఱసాలకు రావలెనని నేను చెప్పలేదే, నీవేల వచ్చితివి ? నీకు విడుదల ఏర్పాటుచేయుదును, వెళ్ళుదువా ?" అంటిని. "వలదు. నీవు, నీభార్య, బిడ్డలు మాకై కారాగృహముననుండ, నేను స్వగృహమున నెట్లుందును ? ముదుసలిని. ఎక్కడనైనను చావు తప్పదుకదా ? ఈ చెఱయందె నేను మరణింపఁగల్గినచో నాకు ఎక్కువతృప్తికల్గును" అని, వెంటనె అతఁడు సమాధానమిచ్చెను. ఎంతటిదీక్ష ! హర్బత్ సింగ్ అక్షరాస్యుఁడు కాకున్నను, ఋషివంటివాఁడని జేజేలుపెట్టితిని. అనినట్లు, అతనికోరికయు తీరినది. 1914 వ సంవత్సరము జనవరినెలలో అతఁడు కారనుండియె పరలోకమున కరిగెను. భారతీయులు పెక్కురు ఉత్సవముచేసి మహాగౌరవముతో అతనికంత్యక్రియలు జరిపిరి. సత్యాగ్రహసమరమున హర్బత్ సింగ్ వంటివారు పెక్కురుండిరి. కాని, కారలో మరణించు గౌరవమతనికె దక్కినది. దక్షిణాఫ్రికా సత్యాగ్రహచరిత్రలో అతనిపేరు సువర్ణాక్షరములతో వ్రాయఁదగినది.

బాల్ఫర్ నుండి రైళ్లలో తీసికొనిపోయిన మహాయాత్రికులకు కారాగారశిక్ష విధించిరి. గనులకుచుట్టు ముండ్లతీఁగ కట్టించి, ఆ ప్రాంతములు డండీ, న్యూకాసిల్ చెఱసాలల

బాహ్య కేంద్రములని ప్రకటించి, మహాయాత్రికులైన కార్మికులచే ప్రభుత్వము బలవంతముగ పనిచేయింపసాగెను. కార్మికులకు కల్పింపఁబడిన ఈ 'బానిసత్వము' మాటవిని భారత దేశమున క్రోధానలము రేగినది. తనకు స్వస్థత లేకున్నను గోఖ్లె గొప్ప కృషిచేసి సాయపడెను. అపుడె—1913 వ సంవత్సరము డిసెంబరు నెలలో—నాఁటి భారతరాజప్రతినిధి లార్డ్ హార్డింజ్ బాహాటముగ దక్షిణాఫ్రికా ప్రభుత్వ చర్యలను తీవ్రముగ ఖండించి, సత్యాగ్రహుల చర్యను హృదయపూర్వకముగ సమర్థించెను. ఇట్లు రాజప్రతినిధి సామ్రాజ్యములోని ఇతర దేశ ప్రభుత్వపుచర్యను విమర్శించుట సాధారణ విషయము కాదు. హార్డింజ్ విమర్శనకు ఫలితముకల్గినది. ఒక విచారణసంఘము నియమింపఁబడినది. వారి నివేదిక వచ్చిన



1914 లో కస్తూరిబాతో లండనులో.

తోడనే దక్షిణాఫ్రికా ప్రభుత్వము 'ఇండియన్స్ రిలీఫ్ బిల్లు'ను ప్రకటించినది. ఎన్నఁడో జరిగిన పరిష్కారము ఈ బిల్లు వలన అమలుకు వచ్చినట్లయినది. మూఁడుపౌనుల పన్ను రద్దు చేయఁబడినది. భారత దేశమున న్యాయసమ్మతములైన పెండ్లిండ్లు దక్షిణాఫ్రికాలోగూడ న్యాయసమ్మతములగును.

దక్షిణాఫ్రికాలో ప్రవేశించుటకు ఒక్క బొటనవ్రేలిముద్ర నిచ్చి 'సర్టిఫికెట్' పొందవచ్చును.

దక్షిణాఫ్రికా సత్యాగ్రహసమరమిట్లు ఎనిమిదేండ్లు సాగి ముగిసినది. అచటి భారతీయులిపుడు సుఖముగనున్నట్లు కన్పించుచున్నది.

నేను భారతదేశమునకు తిరిగివచ్చుటకుముందు గోఖ్లేను దర్శించుటకు 1914 వ సంవత్సరము జులై 18 వ తేదీన ఓడలో ఇంగ్లాండుకు బయలు దేఱితిని. చాలకాలమునకై నను స్వదేశమునకు వెళ్ళగల్గు చుంటినికదాయనియు, గోఖ్లె నాయకత్వమున దేశసేవ చేయవలెనను కోరిక ఇప్పటి కైనను తీరనున్నదికదా యనియు ఒకప్రక్క సంతోషము; ఇరువదియొక్కేం డులు జీవితముగడపి, మానవ జీవితానుభవములలోని సుఖదుఃఖములను చవిజూచి, నా జీవనతంత్రమును గుర్తెఱిగినచోటును – దక్షిణాఫ్రికాను – వదలవలసివచ్చెను కదాయని వేఱొకవంక సంతాపము నా చిత్తమున రేకెత్తినవి. ఓడ జెండాయెత్తినది!!



1914 లో కస్తూరిబాతో ఇండియాలో.

# సంస్కృతి ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 10. | సోవియట్లదేశం | ... | 0-10-0 |
| 11. | నేటి చైనా | ... | 0-10-0 |
| 15. | లెనిన్ | ... | 0- 8-0 |
| 17. | హిందూపద్ పాదుషాహి | ... | 2- 8-0 |
| 19. | ఇండియా స్వాతంత్ర్య సమస్య | ... | 0- 8-0 |
| 21. | సుభాస్‌బోస్ అంతర్థానగాథ | ... | 1- 8-0 |
| 22. | గాంధీతో ఒకవారం | ... | 1- 8-0 |
| 25. | సామ్రాజ్యము | ... | 1- 0-0 |
| 26. | మహమ్మదీయ రాజ్యాలలో జాతీయ వికాసము | ... | 1- 8-0 |
| 27. | నాగరికత చరిత్ర | ... | 1- 4-0 |
| 28. | ప్రపంచ చరిత్ర (రెం. భా.) | ... | 2- 0-0 |
| 29. | భారతీయ నాగరికత | ... | 1- 8-0 |
| 30. | మన వారసత్వము | ... | 1- 8-0 |
| 31. | ప్రపంచ చరిత్ర (మొ. భా.) (1) | ... | 1- 4-0 |
| 32. | ,, ,, (2) | ... | 1- 0-0 |
| 33. | ,, (మూ. భా.) | ... | 2- 0-0 |
| 35. | జీవితాదర్శం | ... | 0- 8-0 |
| 36. | విజ్ఞాన భాస్కరులు | ... | 1- 0-0 |
| 37. | సర్దార్ పటేల్ | ... | 1- 0-0 |
| 38. | వసంతము | ... | 1- 0-0 |
| 39. | విజ్ఞాన శేఖరులు | ... | 0-15-0 |
| 40. | "నా చిన్నప్పుడు..." | ... | 1- 0-0 |

# పిల్లల పుస్తకాలు

| | | | |
|---|---|---|---|
| 1. | లక్కపిడతలు | ... | 1- 0-0 |

# ఇతరులవి

| | | | |
|---|---|---|---|
| 1. | సుందర్ | ... | 3- 0-0 |
| 2. | ప్రతిమా నాటకము | ... | 1-10-0 |
| 3. | మాట - మంతి | ... | 1- 8-0 |
| 4. | పిచ్చు - పాటి | ... | 1- 8-0 |
| 5. | ప్రజా విరోధి | ... | 2- 0-0 |

